

రామ్, శ్యామ్‌ల సాహసకార్యాలు
రాక్షసిపై విజయం




"అదొక అడవి— చీకటి రాత్రి
చేరిరొక కుటీరం—
అదొక విడ్డూరం.




చుట్టూ కుందేళ్లు—
కప్పలున్నాయి. మచ్చుకైనా మనిషి
జాడే లేదు




"బాబోయ్!" వేసేరు—
బెదురు కేక
మాటలాడ సాగేయి—
జంతువుల మూక




"కరుణించండి!-
రక్షించండి!
మేమొకప్పుడు-
మనుష్యులమే
నండి!"




భళ్లా భళ్లా ఉరిమింది-
రాక్షసి దిగింది
చీపురు విమానం నుంచి-
గుడ్లు ఉరిమింది




"చిక్కేరు చేతుల్లో!"—
అది ఇకిలించింది
"మార్చేస్తా కప్పల్లా!"
వెకవెకలాడింది




రామ్, శ్యామ్‌లు—
తక్కువేం తినలేదు
పాపిన్స్ ప్యాకెట్లు—
పైకి విసిరేరు




రాక్షసి సంతోషంతో—
సకిలించింది
నిక్షేపంగా అందరినీ—
విడుదల చేసింది

## ప్రతి గ్రంథాలయంలోను ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

**డాల్టన్ ఏజన్సీస్**
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# ఇదుగో వచ్చింది స్కాలర్!

**బ్లాక్ బర్డ్ వారి
నుంచి విద్యార్థులకు
అతి
చక్కని పెన్ను**



ఇప్పుడు బ్లాక్ బర్డ్ వారు
ప్రత్యేకంగా విద్యార్థుల కోసం
'స్కాలర్'ను సృష్టించారు—
తేలికై సుందరమైన ఆకారంతో
చక్కగా చేతికి అమిరేందుకు
...పట్టులాగా సాఫీగా జారువారే
సిరాకోసం అతి సన్నని
ఇరిడియం కొనగల పాళీతో.
దానిని చూడండి. పరీక్షించండి.
పూర్తి మార్కులు పొందగల
అర్హత ఈ పెన్నుదేనని
మీరు అంగీకరిస్తారు:

స్కాలర్ పెన్ను—
ప్రపంచ ప్రఖ్యాత బ్లాక్ బర్డ్
పరివారం నుంచి మరొక
నాణ్యమైన పెన్ను

heros'-SI-132A TEL

స్వాతంత్ర్య దినోత్సవ
శుభాకాంక్షలు!




ఆగష్టు 15 విడుదల

నోములు నోచుకుని
వ్రతాలుండి తన దైవమైన
నాగుపాము సహాయంతో
భర్తను కాపాడుకున్న
ఒక అపూర్వ యువతి గాథే

దర్శకత్వం: పట్టు

సంగీతం: సత్యం

మాటలు: ఎస్.ఆర్. నంది

నిర్మాతలు:
మురుగన్, కుమరన్, సరవణన్, బాలు




విజయా రిలీజ్

లోకేశ్వరీ ఆర్ట్స్ పిక్చర్స్

# ఆడంబరాలు అనుబంధాలు

నిర్మాత: A.K.V. ప్రసాద్

దర్శకత్వం: C.S. రావు B.A. (Litt)

ఛాయాగ్రహణం: ఆర్.K. రాజు

సంగీతం: చక్రవర్తి



ఆంధ్ర-నైజాం: శ్రీ ఫిలింస్
సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్

VEEKAY

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [ "బంగారు నగలు" ] జయంతి లక్ష్మి రచన. ఈ కథలో ఒక చిత్రమైన నీతి ఉన్నది. మనిషి దేనినైనా స్వయం శక్తితోనూ, స్వయం కృషితోనూ సాధించినప్పుడే దాన్ని అనుభవించగలడు. కోరికలు ఉన్నంత మాత్రంచేత లాభంలేదు. వాటిని సాధించే శక్తీ, సాధనకు కృషి చేసే అర్హతా లేనప్పుడు అలాటి కోరికలను గొంతెమ్మ కోరికలు అంటాం. గొంతెమ్మ కోరికలు ఫలిస్తే ఏమయేదీ ఈ కథ చెబుతుంది.

సంపుటి 56 ఆగష్టు '74 సంచిక 2






క్షారం జలం వారిముచః పిబంతి,
తదేవ కృత్వా మధురం వమంతి;
సంత స్తథా దుర్జనదుర్వచాంసి
పీత్వా చ సూక్తాని సముద్గిరంతి. 1

[మేఘాలు సముద్రపు ఉప్పునీటిని తీసుకుని తియ్యని నీటిని వర్షిస్తాయి. అలాగే సత్పురుషులు దుష్టుల చెడుమాటలను విని మంచి మాటలనే పైకి చెబుతారు.]

యస్య నాస్తి వివేకస్తు,
కేవలం యో బహుశ్రుతః,
న స జానాతి శాస్త్రార్థాన్
దర్వీ పాకరసా నివ. 2

[తెగ చదివిన వాడైనా వివేకం లేని వాడైతే శాస్త్రార్థాలను తెలుసుకో లేడు. వంట రుచి గరిటెకు తెలుస్తుందా?]

ధూమః పయోధరపదం కథమ ప్యవాప్య
వర్షాంబుభిః శమయతి జ్వలనస్య తేజః;
దైవా దవాప్య కలుషప్రకృతి ర్మహత్వం
ప్రాయః స్వబంధుజనమేవ తిరస్కరోతి. 3

[అగ్నికి బంధువైన పొగ ఎలాగో మేఘంగా మారి వర్షపు నీటితో అగ్ని యొక్క తేజస్సును చల్లార్పుతుంది. కలుషస్వభావం గలవాడు అదృష్టవశాన గొప్పవాడైతే తరచుగా తన బంధువులనే తిరస్కరిస్తాడు.]

---

వ్యత్యాసాలు

---



## 2

[శ్రావస్తీనగరాన్ని ఏలే దానశీలు డనే రాజుకు లేక లేక ముగ్గురు కవలపిల్లలు పుట్టారు. ముగ్గురూ ఆడపిల్లలే. వాళ్ళు పుట్టినప్పటి నుంచీ ఏదో ప్రమాదానికి లోనవుతూనే వున్నారు. రాజు దీన్ని గురించి జ్యోతిష్కుడితో మాట్లాడుతూండగా, కవలులు ఉద్యానవనంలో స్పృహ తప్పి పడిపోయినట్టు తెలిసింది. రాజూ, రాణీ వాళ్ళ దగ్గిరకు పరిగెత్తారు. తరవాత—]

రాజూ, రాణీ ఉద్యానవనాన్ని చేరుకునే సరికి ముగ్గురు పిల్లలూ కళా కాంతీ లేకుండా పడి వున్నారు. పరీక్షించి చూడగా ఒళ్ళు చల్లబడింది, శ్వాస సరిగా ఆడటం లేదు.

ఇది చూసి కంగారుపడి, "ఇదేమిట్రా, భగవంతుడా!" అని చెప్పి అమిత విచారంతో రాజూ, రాణీ కొయ్యబారి పోయారు. మరికొద్ది సేపటికి ఆస్థానవైద్యుడు వచ్చి, రాజు భుజం తట్టేవరకూ వారు యీ ప్రపంచంలోనే లేరు.

అప్పుడు ఆస్థానవైద్యుడు ఆ చుట్టు ప్రక్కల పరికించాడు. పిల్లలు పడి వున్న చోటికి కొంచెం దూరంలో ఒక పండు కనిపించింది. పండు పైన అక్కడక్కడ పన్ను దిగబడిన గాట్లు కనిపించినై. ఆస్థానవైద్యుడు ఆ పండును తీసుకొని వాసన చూచి, "ఓహో, ఇదా సంగతి!




ఇది విషపుపండు. దీనిని కొరకటం వల్లనే పిల్లలు యిలా పడిపోయారు,'' అని వెంటనే ఏదో మందు పిల్లలకి వాసన చూపించాడు. అలా చూపటం వల్ల, ఆకస్మిక ప్రమాదం ఏమీ కలగకుండా, ఆ పిల్లలు అదే స్థితిలో నిలిచి వున్నారు. తర్వాత ఆయన ఆ పండును దాదికి చూపుతూ, ''ఈ పండు ఎక్కడిదో నీకు తెలుసా ?'' అని అడిగాడు.

అందుకు బదులుగా దాది యిలా చెప్ప సాగింది: ''మామూలు ప్రకారం అమ్మాయిలను షికారు కని వెంటబెట్టుకు వచ్చానండి. కొంతసేపు అలా అలా తిప్పి, చివరకి యీ చెట్టు కిందకి వచ్చి కూర్చున్నామండి. ఇంతలోనే అమ్మాయిలు, 'దాహంగా వుంది, నీళ్ళు తెమ్మని' అడిగారండి. నేను నీళ్ళు తీసుకుని తిరిగి వచ్చేటంతలో పెద్దమ్మాయి, చిన్నమ్మాయి అప్పటికే స్పృహ తప్పి పడిపోయి వున్నారండి. నేను సరిగ్గా వాళ్ళ దగ్గిరికి వచ్చే వేళకి, బుల్లి అమ్మాయిగారు యీ పండు కొరుకుతున్నారండి. ఏమిటా యీ పండు అని నేను చూచేటంతలో, బుల్లిఅమ్మాయిగారు కూడా స్పృహతప్పి పడిపోయారండి. ఇంతకు మించి నాకు ఇక్కడ జరిగినది మరేమీ తెలియదండి,'' అని చెప్పి ఆగింది.

ఆస్థానవైద్యుడు తల ఎత్తి ఒక్కసారి చెట్టు పైకి చూచేసరికి, దానిపైన ఒక గద్ద కనిపించింది. ''అదుగో, ఆ పాపిష్ఠి పక్షే యీ పండు వదేసి వుంటుంది. ఇంకా చూస్తారేం, చంపండి దాన్ని!'' అని అరిచాడు.

అక్కడ చేరిన వాళ్ళలో ఒకడు తన బాణంతో ఆ గద్దని కొట్టబోయేసరికి, అది రివ్వున ఎగిరి, మరి కనబడకుండా పోయింది.

ఈలోగా ఆస్థానవైద్యుడిచ్చిన ఔషధం పని చేసి, పిల్లలు ముగ్గురూ కదల సాగారు. అప్పటికి గాని అక్కడ చేరిన వారెవరికీ ప్రాణాలు కుదటబడలేదు.

తర్వాత ముగ్గురు పిల్లల్నీ తీసుకుని, ఆస్థానవైద్యునితో సహా రాజూ, రాణీ తమ మేడ చేరుకున్నారు. తిరిగి ఆస్థాన వైద్యుడు మరో ఔషధం యిచ్చాడు. మరి కొంతసేపటికల్లా పిల్లలు ముగ్గురూ లేచి కూచున్నారు. ఇంత జరిగినా ఆ పిల్లలు కొంచెం కూడా అలిసినట్లు కనిపించ లేదు. యథాప్రకారం కలకల్లాడుతోనే వున్నారు. పిల్లలు కలకల్లాడుతూ వుండటం చూచి, రాజూ, రాణీ, ఆస్థాన వైద్యుడూ కూడా ఎంతగానో సంతోషించారు.

ఈ ప్రమాదం జరిగిన నాటికి పిల్లలు నాలుగేళ్ళవాళ్ళు. జ్యోతిష్కుడు చెప్పిన ప్రకారం యింకా మూడేళ్ళవరకూ వాళ్లకి దినదిన గండమే అని రాజు నిశ్చయించుకునే వున్నాడు. ఈ మూడేళ్ళు వాళ్ళకి ఏ ఆపదా రాకుండా కాపాడటం ఎలాగా అని యిప్పుడు తీవ్రంగా ఆలోచించసాగాడు.

ఒకనాడు రాజు ఒంటరిగా తోటలో షికారు చేస్తూండగా ఒకచోట ఒక బండ రాయి కనిపించింది. ఆ బండపైన, ''భూగృహం'' అని రాసి వుండటం కనిపించేసరికి, రాజు ఎంతగానో ఆశ్చర్యపోతూ ఆ బండని పక్కకు తొలిగించి చూచాడు. మెట్లు కనిపించినై.

రాజు ఒక్కొక్క మెట్టే దిగిపోయి పోయి ఒక పెద్ద మహలు చేరుకున్నాడు. ఆ మహలు ఏవరు ఎప్పుడు ఎందుకు





కట్టించారో రాజుకి తెలియదు. దాని గోడ లన్నీ పాలరాతితో చెక్కబడి వున్నై. నేల అంతా పచ్చలతో తాపటం చేసి వున్నది. అనేకరకాల వింతలతో, విలువైన వస్తువులతో ఆ మహలు ఎవరో గొప్ప ప్రభువు, ఎంతో కాలం కిందట కట్టించి నట్టుగా వున్నది.

రాజు ఆ మహలు అంతటా వింతగా చూచి, తిరిగి వచ్చిన దారినే పైన తోట లోకి చేరుకున్నాడు. బండని మళ్ళీ యథాప్రకారం వుంచి, అక్కడ ఆ బండ వున్నట్లు తనకు తప్ప మరెవరికీ తెలియకుండా వుండేటందుకు గాను, అక్షరాలు రాసి వున్న వైపు లోపలికి మూసి, అప్పటికి మనసుకి తృప్తి కలగక, ఆ చుట్టు పక్కల వున్న ఆకూ అలమూ తెచ్చి, కంటికి కనిపించకుండా బండ కప్పి వేశాడు.

తరవాత రాజు మేడకి తిరిగి వచ్చాడు. కాని, తాను తోటలో చూచిన, 'భూగృహం' గురించి రాణికి కూడా చెప్పలేదు. ఎందువల్ల నంటే, భూగృహ రహస్యం తనకి తప్ప, ఎలాంటి పరిస్థితులలోనూ మరో పురుగుకి కూడా తెలియ కూడదని రాజుకి ఆరాటం పట్టుకొన్నది.

ఇప్పుడు ఇటువంటి రహస్య గృహం తలవని తలంపుగా కంటబడింది గనక, రాజు ఇక తన కుమార్తెలకి ఆపదలు రాకుండా చూడటానికి చేయవలసిన ఏర్పాట్లు గురించే తన దృష్టి అంతా కేంద్రీకరించాడు.

మొట్ట మొదట రాజు ఒక వంద మందికి, మూడేళ్ళపాటు సరిపడేటంత ఆహారసామగ్రి అవీ, నమ్మకమైన సేవకుల సహాయంతో భూగృహంలోకి చేర్పించాడు. ఆ సేవకులను తిరిగి బయటికి రానివ్వకుండా, అందులోనే బంధించి, తాను మాత్రం తిరిగి మేడకు రోజూ లాగానే చేరుకున్నాడు. తర్వాత ముగ్గురు దాసీలతో తన ముగ్గురు కుమార్తెలను వెంటబెట్టుకొని తోటలోకి వెళ్ళాడు. రాజు



పిల్లలను షికారుకు తీసుకు వెళుతున్నాడు అనుకున్నది రాణి.

తోటచేరుకోగానే రాజు సరాసరి భూగృహద్వారం వద్దకు వెళ్ళి, అక్కడి ఆకూ అలమూ అవతలికి విసిరివేసి, దాని కిందవుండే బండను తొలగించాడు. దాసీలు ఒక్కసారిగా ఆశ్చర్యపోయి, రాజు యింకా ఏమి చేస్తాడో అని ఆత్రంతో చూస్తున్నారు. రాజు ముందు దాసీలను పిల్లలతో సహా మెట్లుదిగి లోపల ప్రవేశించమని, వాళ్ళ వెనకనే తనూ లోపలికి వెళ్ళి, వెంటనే ఎవళ్ళకూ తెలియకుండా బండతో తిరిగి ద్వారం మూసి వేశాడు.

ఒక్కొక్క మెట్టు దిగుతున్న కొద్దీ దాసీలకు భయం జాస్తి కాసాగింది. రాజు తమనీ, తన పిల్లల్ని యిలా ఎక్కడికి ఎందుకు తీసుకు పోతున్నాడో వాళ్ళకు అర్థంకాలేదు. పోనీ అడిగి తెలుసుకుందామంటే, రాజుని ప్రశ్నించేందుకు వాళ్ళకు ధైర్యం చాలలేదు. అందుచేత ప్రాణాలు అరచేతుల్లో పట్టుకొని అలా దిగుతూ పోయి, చివరకు మహలు చేరుకున్నారు. అంతకు ముందే రాజు అక్కడ బంధించిన సేవకులను చూసేసరికి, దాసీలకు కొంత ధైర్యం కలిగింది. ఇదంతా రాజు ఏదో ముందు ఆలోచనతోనే ఏర్పాటు చేశాడని అప్పటికి తెలిసింది వాళ్ళకు.

ఆ తర్వాత రాజు అక్కడ వున్న వందమంది నౌకర్లకూ, ఆ ముగ్గురు దాసీలకూ తన ముగ్గురు పిల్లల్ని ఒప్పగిస్తూ, "ఈనా చిట్టి తల్లులు ముగ్గురూ, నాకు లేక లేక కలిగిన సంతానం అని మీ అందరికీ తెలుసు కదా? వాళ్ళకు ఇప్పుడు నాలుగో ఏడు. ఈ నాలుగేళ్ళలోనూ వాళ్ళు ఎన్నో గండాలు గడిచి, ఎలాగో బ్రతికి బైట పడిన సంగతి కూడా మీకు తెలిసే వున్నది. జాతక రీత్యా వాళ్ళకు మరో మూడు సంవత్సరాల వరకూ, దిన దిన గండమేననీ, ఈ మూడేళ్ళూ గడిచిపోతే

ఆ తర్వాత వాళ్ళకు ఎటువంటి భయమూ వుండదనీ తెలిసింది. ఈ మూడేళ్ళ పాటూ వీళ్ళను ఈ భూగృహంలో దాచి, మీకు ఒప్పగిస్తున్నాను. ఇందులోకి మరో పురుగు రావటానికి అవకాశంలేదు.

"నా పిల్లల్ని మీరు యిక్కడ కాపాడు తున్నట్టు మీకూ, నాకూ తప్ప మరెవ్వరికీ తెలియదు. రాణీకయినా తెలియదు. పుట్టినప్పటి నుంచీ యీ నా పిల్లల్ని ఏదో దుష్ట గ్రహం వెంటాడుతూ వున్నదని నా నమ్మకం. వాళ్ళు ఈ భూగృహంలో వున్నట్లు ఆ గ్రహానికి ఏ మాత్రం తెలిసినా, ఎలాగో వీళ్లను తన పొట్టబెట్టు కుంటుంది. కనుక ఈ విషయం బైటికి పొక్కకుండా చాల జాగ్రత్తగా వుండటం మీ అందరి విధి. వీళ్ళు యిక్కడ వుంటున్నట్టు, పిట్టకయినా తెలిసిందీ అంటే, అది నా వల్లనన్నా కావాలి, లేదా మీ వల్ల నన్నా కావాలి. నేను మాత్రం యీ మూడు సంవత్సరాలూ ఈ విషయం ఎత్తనే ఎత్తను. అలాగే మీరూ జాగ్రత్తతో వుండి నాకు సాయపడాలి. ఇందుకు భిన్నంగా జరిగిందీ అంటే జాగర్త. అలా కాక నమ్మకంగా నా తల్లుల్ని కాపాడా రంటే, గడువు తీరిన తర్వాత మీరు కని విని ఎరుగని గొప్ప బహుమతులు యిస్తాను.



"మీకు యీ మూడేళ్ళ పాటూ కావల సిన ఆహార పదార్థాలూ అవీ అన్నీ యిక్కడ వున్నై. కనుక యింతకు ముందు నా మేడలో వుండగా నా తల్లులు ఎలా సుఖంగా వుండేవారో, యిప్పుడూ అలాగే ఏ కొరత లేకుండా వుండవచ్చు. నా చిట్టితల్లులు మరేదైనా అవసరమని మిమ్మల్ని అడిగితే, నాతో చెప్పండి. వెంటనే సమకూరుస్తాను. ఎప్పటికప్పుడు వచ్చి మీ అందరి క్షేమం కనుక్కుం టూనే వుంటాను. మరి ఇక నే వెళు దునా?" అని అడిగాడు రాజు.

ఇది వింటున్న ఆ వంద మంది సేవ కులూ, ముగ్గురు దాసీలూ మొట్ట మొదట

భయంతో తెల్లబోయి చూచినా, రాజు తీరా యీ సందర్భంలో చెప్పదలచిన సంగతులన్నీ చెప్పి ముగించే సరికి, వారందరూ ఎంతో సంతోషంగా కని పించారు.

దాసీలలో ఒకతె రాజుతో, "మొదట మొదట మమ్మల్ని యీ భూగృహంలోకి ఎందుకు తెచ్చారో అర్థంకాక మేము ఎంతో భయపడ్డాము. కాని యిప్పుడు నిజం తెలుసుకున్నాం. కనుక మాకు ఏవిధమైన చింతా లేదు. అమ్మాయిలను కంటికి రెప్పలా కాపాడవలెననే విషయం మీరు ప్రత్యేకించి ఇంత దూరం మాకు చెప్పవలెనా? అది మా విధి. మా ధర్మం మేము తప్పక నెరవేర్చు కుంటాము. మీరు యీ విషయమై ఎలాంటి దిగులూ పెట్టుకోక నిశ్చింతగా వుండండి. కాని, మా సందేహమల్లా ఒక్కటే. అమ్మాయి లను ఇక్కడ దాచినట్టు రాణీగారికి కూడా తెలియదంటిరే! మరి ఇప్పుడు మీరు ఒంటరిగా మేడకుపోతే, రాణీగారు అమ్మాయిలు ఏమైనారని అడగరా?" అన్నది.

"అదంతా నేను చూసుకుంటాను. మీరు పిల్లల విషయమై జాగ్రత్తపడండి!" అని చెప్పి రాజు తిరిగి తన మేడకు బయలుదేరాడు.

ఇక అక్కడ రాణీ సంగతి ఎలా వుందో చూడండి. పిల్లల్ని షికారు కని తీసుకు వెళ్ళిన రాజు, అప్పటికి ఎంతో సేపు అయినా కూడా తిరిగి రాకపోయే సరికి, మళ్ళీ ఏం ప్రమాదం వచ్చి పడిందో అని ఖంగారు పడుతూ, ఎప్పు డెప్పుడు వస్తారా అని రాణీ ఎదురు చూస్తున్నది.

ఇంతలో రాజు పెద్ద పెట్టున ఏడుస్తూ అక్కడికి చేరుకున్నాడు. షికారుకని పిల్లల్ని వెంటబెట్టుకు వెళ్ళిన రాజు, వాళ్ళు లేకుండా ఒక్కడే తిరిగి రావటం, పైగా ఏడుస్తూ రావటంచూసి మనస్థైర్యం తప్పి, రాణీ మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది. —(ఇంకావుంది)





# బంగారు నగలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, '' రాజా, వెనకటికి మధుసూదనుడి లాగా కాకుండా, నీ బోధకు తగిన ఫలితం నీకు సకాలంలో తప్పక లభిస్తుందని నా నమ్మకం. శ్రమ తెలియకుండా ఉండ గలందులకు నీకు ఆ మధుసూదనుడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం ఆర్యావర్తంలో మధుసూద నుడు అనే కాపు ఉండేవాడు. అతను సామాన్య కుటుంబీకుడు ; తన ఇద్దరు కొడుకులతో కలిసి వ్యవసాయం చేసుకుంటూ ఉన్నంతలో సుఖంగానే బతుకుతున్నాడు.

## బేతాళ కథలు



ఒకనాడు మధుసూదనుడు ఒంటరిగా తన ఇంటి వసారాలో కూర్చుని ఉండగా అతని కొక ఆలోచన వచ్చింది. తాను ఎంత లోటు లేకుండా జీవిస్తున్నా ధనికుడు కాడు. తన దగ్గిరే గనక రెండు వీశల బంగారు నగలుంటే గొప్ప ధనికుడుగా చలామణీ అవుతాడు!

అతని ఇంట చాలా కాలంగా ఒక గృహదేవత ఉంటున్నది. ఆ దేవత ఇంటి యజమానికి ఏదో విధంగా సహాయం చెయ్యాలని కొంత కాలంగా సమయం కోసం చూస్తున్నది.

ఇప్పుడు మధుసూదనుడికి ఈ ఆలోచన రాగానే ఆ గృహదేవత రెండు వీశల బరువుగల బంగారు నగల మూటను అతని ముందు పడేసింది.

మధుసూదనుడికి మొదట ఆశ్చర్యం కలిగింది. మూటవిప్పి బంగారం చూసే సరికి ఆనందమూ, దానితోబాటు ఆందోళనా కలిగాయి. ఆ మూట ఎలా వచ్చినదీ అతనికి తెలీదు, కాని తన మనసులో ఆలోచన కలగటానికీ, ఆ మూట ప్రత్యక్షం కావటానికీ సంబంధం ఉన్నట్టు మాత్రం అతడికి తోచింది.

ఆ మూటను మధుసూదనుడు తప్ప మరెవ్వరూ చూడలేదు. అతని కొడుకులు బయటికి వెళ్ళి ఉన్నారు. భార్య వంట పనిలో మునిగి ఉన్నది. మధుసూదనుడు చప్పున ఆ మూటను తీసుకుని పెరట్లోకి వెళ్ళి, దాన్ని వేపచెట్టు మొదట్లో పాతిపెట్టేశాడు. ఆ తరవాత అతను ఇంట్లోకి వచ్చి, ఆ బంగారాన్ని ఎలా ఉపయోగించవలసినదీ తాపీగా ఆలోచించాలని నిర్ణయించుకున్నాడు.

అతను మామూలు పనులు చేసుకుంటున్నప్పుడు కూడా అతని ఆలోచన ఆ బంగారాన్ని ఉపయోగించటం ఎలాగా అన్న సమస్య మీదనే ఉన్నది. దాన్ని ఒక్కసారిగా అమ్మటమా? కొంచెం కొంచెంగా అమ్మటమా? డబ్బుగామార్చి పొలం కొనటమా? వ్యాపారం చెయ్య

టమా? బంగారాన్ని లక్ష విధాలుగా ఉపయోగించవచ్చు. కాని ప్రతి పద్ధతిలోనూ ఏదో ప్రమాదం ఉంటూ వచ్చింది. ఏం చేసినా లోకులు అనేక ప్రశ్నలు వేస్తారు. అందుచేత, తాను ఏదో ఒక నిర్ణయానికి వచ్చేదాకా మధుసూదనుడు తన బంగారం గురించి భార్యకుగాని, కొడుకులకు గాని చెప్పదలచలేదు.

మధుసూదనుడు అలా కొంతసేపు తిరిగి వస్తే ఆలోచన బాగా సాగుతుందని ఊళ్ళోకి బయలుదేరాడు. ఊళ్ళో ఇద్దరిని కొరత వేస్తున్నారు. ఆ దృశ్యం చూసి మధుసూదనుడు కంగారుపడి, వాళ్ళను ఎందుకు కొరత వేస్తున్నారని అక్కడ వున్న వారిని అడిగాడు.

"వాళ్ళు ఒక ధనికుడి ఇంట బంగారు నగలు దొంగిలించారు. దొంగతనానికి అదే శిక్ష గద!" అని ఎవరో జవాబు చెప్పారు.

మధుసూదనుడు కంపించి పోయాడు. అతనికి ముచ్చెమటలు పోశాయి. తనకు దొరికిన నగలు దొంగసొత్తు కాదుగద! ఇలా అనుకుంటూ అతను తిన్నగా ఇంటికి పోయాడు.

అది మొదలు మధుసూదనుడి మనస్సు వికలం కాసాగింది. ఆ బంగారమంతా రహస్యంగా ఎలా అమ్మటం? అది రొక్కంగా మారిస్తే గాని మనసుకు శాంతి ఉండదు. దాన్ని రొక్కంగా మార్చే మార్గం కనబడలేదు. అది ఒక





పోడు. అతని మనోవ్యాధి శరీరాన్ని దెబ్బతీసింది.

తండ్రి అలా కావటానికి కారణం అడిగారు కొడుకులు, కాని మధుసూదనుడు ఏమీ చెప్పక పోగా చీదరించుకున్నాడు. వాళ్ళు తల్లిని అడిగారు. ఆమెకు కూడా ఏమీ తెలీదు. వైద్యుణ్ణి పిలిపించారు. వైద్యుడు వచ్చి చూసి, మధుసూదనుడికి ప్రత్యేకంగా జబ్బు ఏమీ లేదన్నాడు.

కాని కొద్దికాలం లోనే మధుసూదనుడు ఆరోగ్యం పూర్తిగా చెడిపోయి, మంచం పట్టాడు. తరవాత కొద్ది రోజులకు అపస్మార స్థితి ఏర్పడింది. ఆ స్థితిలో అతను చాలాసార్లు "బంగారం," "నగలు" అనే మాటలు అన్నాడు.

మూడు రోజులు అపస్మారంలో ఉండి, నాలుగో రోజు అతను కళ్ళు తెరిచి చూసే సరికి, పక్కన భార్యా, కొడుకులూ కనిపించారు.

పెద్ద కొడుకు అతనితో, "నాన్నా, బంగారమనీ, నగలనీ కలవరించావు. వాటిని ఎక్కడన్నా దాచావా?" అని అడిగాడు.

మధుసూదనుడు తన భార్య కేసీ, ఇద్దరు కొడుకుల కేసీ చూసి బలహీనంగా నవ్వి, పెద్ద కొడుకుతో, "మీ అమ్మనూ,

మనోవ్యాధిలాగా తయారయింది. అసలు తనకు బంగారం దొరికిం దన్నది భ్రమ ఏమోనని అకస్మాత్తుగా ఒక వెర్రి ఆలోచన వచ్చింది. ఎవరూ చూడకుండా మధుసూదనుడు వేపచెట్టు మొదట్లో తవ్వి చూశాడు. బంగారం ఉన్నది. అది భ్రమకాదు. తనను కొరతవేసినట్టు రాత్రిపూట పీడకలలు రాసాగాయి. నిద్రలో అరిచి ఇంటిల్లిపాతినీ కంగారు పెట్టేవాడు.

మధుసూదనుడు నానాటికీ కుంగిపోతున్నాడు; పొలం పని మానేశాడు; భార్యా బిడ్డలతో మాట్లాడటం పూర్తిగా పోయింది; సరిగా తిండి తినడు, నిద్ర

తమ్ముణ్ణి జాగ్రత్తగా చూసుకో,'' అని చెప్పి, ప్రాణాలు వదిలాడు.

బేతాళుడీ కథ చెప్పి, ''రాజా, చచ్చిపోతూ మధుసూదనుడు ఎందుకు నవ్వాడు? తాను అనుభవించలేకపోయిన బంగారాన్ని తన భార్యా పిల్లలూ అయినా అనుభవించటానికి లేకుండా చేసి, ఆ బంగారం రహస్యాన్ని తనతోనే ఎందుకు తీసుకుపోయాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మధుసూదనుడు చాలా సామాన్య కావు. అతనికీ రెండు వీశల బంగారానికీ మధ్య చాలా దూరం ఉన్నది. పేదవాడు ధనికుడు కావటానికి సమాజం ఆమోదించే మార్గాలు కొన్ని ఉంటాయి, ఆమోదించని మార్గాలు కొన్ని ఉంటాయి. సమాజానికి ఎదురుతిరిగే సాహసంగలవాడు దొంగతనంలాటి నేరాల ద్వారా ధనికుడవుతాడు. కాని మధుసూదనుడు ఏ మార్గమూ అవలంబించకుండానే బంగారం సంపాదించాడు. అందుకే అతను దాన్నిగురించి ఎవరికీ తెలియకుండా రహస్యంగా దాచాడు. తన దగ్గిర బంగారం ఉండటమే సంఘద్రోహం అన్న భావం అతనిలో స్పష్టంగా ఉన్నది. దానికి తోడు అది దొంగ సొత్తయి ఉండవచ్చునన్న అనుమానం తోడయేసరికి ఆ బంగారం అతని పాలిటి మృత్యువే అయింది. తాను పడిన వేదన తన కొడుకులూ, భార్యా పడగూడదనే ఉద్దేశంతో అతను రహస్యాన్ని బయట పెట్టలేదు. వాళ్ళు సుఖంగా బతకగలుగుతారన్న ఆశతో అతను నవ్వాడు. బంగారం దొరికినదాకా అతను కూడా సుఖంగా బతికినవాడే కద!'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

—(కల్పితం)






పూర్వం కాబూల్ నగరంలో ఒక గజ దొంగ ఉండేవాడు. వాడు దొంగతనాలు చెయ్యటంలో ఘటికుడు. వాడు అనేక మంది ధనికుల ఇళ్ళు దోచుకోవటమే గాక, ఒకసారి సుల్తానుగారి కోటలో కూడా ప్రవేశించి, దొంగతనం చేసి, పట్టుబడకుండా తప్పించుకుపోయాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా వాడు భటులకు దొరకకపోయేసరికి, వాణ్ణి పట్టియిచ్చిన వాడికి గొప్ప బహుమతి ప్రకటించాడు సుల్తాను.

ఆ నగరంలో వజ్రాల వర్తకుడు ఒకడు ఉండేవాడు. దొంగ ఇంకా అతని ఇంటికి రాలేదు! ఏదో ఒకరోజు వాడు వస్తాడని గ్రహించి చాలా మెలకువగా ఉంటున్నాడు. ఆయన రాత్రివేళ నిద్ర పోవటం లేదు. పగలే దుకాణంలో అప్పుడప్పుడూ కునుకుతీ న్నాడు.

ఆయన ఊహించినట్టే గజదొంగ ఒక రాత్రి ఆయన ఇంట ప్రవేశించి, పడక గది కిటికీలో నుంచి లోపలికి తొంగి చూశాడు.

రాత్రి ఎంతో పొద్దుపోయినా వర్తకుడూ, అతని భార్యా ఇంకా మేలుకునే ఉండి, ఏదో ముఖ్య విషయం గురించి మాట్లాడుకుంటున్నారు.

దొంగవారి సంభాషణను చాలా శ్రద్ధగా విన్నాడు.

"మన అమ్మాయి ఫకీరువాణ్ణి తప్ప చేసుకోనంటున్నది. ధనవంతుడికి ఇచ్చి చెయ్యటం నాకూ ఇష్టం లేదు మరి. ఫకీరులు పుణ్యాత్ములు, అలాటి భర్తే కావాలని పిల్ల అంటున్నది. దాని కోర్కె నెరవేర్చటమే మంచిదనుకుంటున్నాను. మరి నువేమంటావు?" అన్నాడు వజ్రాల వర్తకుడు.

అజీజ్

"తండ్రీ, కూతురూ ఒకే నిశ్చయానికి వచ్చాక, మధ్య నా ఉద్దేశం కూడా దేనికి? పిల్లను ఫకీరుకే ఇచ్చి చెయ్యండి," అన్నది అతని భార్య.

"ఐతే, రేపటి నుంచీ మన వీధిలోకి ఎవరైనా ఫకీరు వస్తే మన అమ్మాయికి భర్తగా పనికి వస్తాడేమో చూడు. నేను కూడా అదే ప్రయత్నంలో ఉంటాను. అమ్మాయి పెళ్ళి త్వరలో చేసెయ్యటం బావుంటుంది," అన్నాడు భర్త.

ఈ మాట విన్న దొంగకు కళ్ళు మిల మిలా మెరిశాయి. తాను ఫకీరువేషం వేసుకుని వాళ్ళను సులభంగా మోసం చెయ్యవచ్చు ననుకున్నాడు వాడు. ఈ దెబ్బతో వర్తకుడి కూతురితో బాటు వర్తకుడి ఆస్తి అంతా తనదే అవుతుందని వాడు సంబరపడ్డాడు. వాడు వెంటనే ఇంటికి వెళ్ళిపోయాడు.

మర్నాడు దొంగ ఫకీరువేషం ధరించి, భక్తిగీతాలు పాడుకుంటూ వజ్రాలవర్తకుడి ఇంటి కేసి వచ్చాడు. వర్తకుడు తన నౌకర్లను పంపి, వాణ్ణి లోపలికి ఆహ్వానించి గౌరవించి, కూర్చోబెట్టి, వాడికి ఎదురుగా కూర్చున్నాడు.

ఇంతలో వర్తకుడి భార్య లోపలినుంచి విసనకర్ర పట్టుకువచ్చి, దొంగకు విసురుతూ, "స్వామీ, మీ దర్శనభాగ్యం వల్ల మా జన్మలు తరించాయి. మీరు దర్శించిన పుణ్యక్షేత్రాలను గురించి చెబితే, విని ఆనందిస్తాము," అన్నది.



అంతదాకా, తనఎత్తు పారిందని ఆనందిస్తున్న దొంగ ఇప్పుడు పెద్ద చిక్కులో పడ్డాడు. వాడు ఎన్నడూ ఏ పుణ్య క్షేత్రమూ చూడలేదు. అందుచేత వాడు చాకచక్యంతో ఉన్నవీ, లేనివీ కల్పించి చెప్పసాగాడు.

అంతలో ఒక రాజభటుడు వచ్చి వజ్రాల వర్తకుడితో, "అయ్యా, మీ ఇంటికి ఎవరో గొప్పఫకీరు వచ్చారట. ఆ సంగతి సుల్తానుగారికి తెలిసి, వెంటనే ఆయనను పిలుచుకురమ్మని మమ్మల్ని పంపారు." అన్నాడు.

భటుడి మాటలు విని దొంగ సంతోషంతో ఉబ్బి తబ్బిబ్బయి పోయాడు; తాను లేచినవేళ మంచిదనీ, అందుకే తనకు అంతా సవ్యంగా జరుగుతున్నదనీ అనుకున్నాడు. సుల్తానుకు ఫకీరులంటేనూ, మహాపురుషులంటేనూ చాలా భక్తి! ఇవాళ తన అదృష్టం పండింది! సుల్తానుగారి సన్మానం తనకు లభిస్తున్నది!

వజ్రాల వర్తకుడు వాడితో, "స్వామీ, ముందు సుల్తానువారి వద్దకు వెళ్ళండి. తరవాత మళ్ళీ మనం కలుసుకుందాం." అన్నాడు.

దొంగ చిరునవ్వు నవ్వుతూ, తన పెట్టుడు గడ్డం దువ్వుకుంటూ, భటుల వెంట దర్బారుకు వెళ్ళాడు. సుల్తాను వాణ్ణిచూసి, "దయచెయ్యండి! మా కారాగృహం మీ కోసం ఎంతకాలంగానో ఎదురు చూస్తున్నది!" అన్నాడు.

భటులు వాడి గడ్డం లాగేసి, సుల్తాను ఆజ్ఞాపించగా కారాగృహానికి తీసుకుపోయారు. తరవాత వజ్రాలవర్తకుడు సుల్తానుతో గడచిన రాత్రి జరిగినదంతా చెప్పి, తాను దొంగ తన ఇంటికి తప్పక వస్తాడని ఊహించి, ముందుగా ఎలా కబురు చేసినదీ వివరించాడు.

సుల్తాను వజ్రాలవర్తకుడి సమయస్ఫూర్తిని ఎంతగానో మెచ్చుకుని, తాను ప్రకటించిన బహుమానాన్ని ఆయనకు ఇచ్చేశాడు.





# గుడ్డివాడి ముష్టిచిప్ప

ధర్మవరం అనే ఊళ్ళో ఒక గుడ్డి బిచ్చగాడు ఉండేవాడు. వాడికి ఉన్న ఆస్తి అంతా ఒక ముష్టిచిప్ప. ఆ చిప్ప దిగువన నాలుగు కుందలు ఉండేవి. అవి మెరిసేవి. ఆ సంగతి గుడ్డివాడికి తెలియదు. కాని వాడు ముష్టి ఎత్తుకునేటప్పుడు దారే పొయ్యేవాళ్ళకు వాటి మెరుపు కనిపించేది.

ఆ గ్రామంలో కొమటయ్యా అనే నూనె దుకాణం వాడు ఉండేవాడు. గుడ్డివాడు రోజూ ముష్టి ఎత్తుతూ ఆ దుకాణం ముందు నుంచే వెళ్ళేవాడు. కొమటయ్యా గుడ్డివాణ్ణి పిలిచి ఒక దమ్మిడీ వేసి, ఆ చిప్ప మెరుపు పరిశీలించేవాడు. ఆ మెరిసేది బంగారమే నని కొమటయ్యా నిశ్చయించుకున్నాడు.

ఆ గ్రామంలో నాగులు అనే దొంగ ఉన్నాడు. కొమటయ్యా నాగులును పిలిపించి, "నీకు ఒక విషయం చెబుతాను. అది మనిద్దరి మధ్యనే ఉండనీ. మన ఊళ్ళో ఒక గుడ్డివాడున్నాడు. వాడు అడుక్కునే చిప్ప మెరుస్తుంది. అది ఎందుకు మెరుస్తుందో ఎవరికీ తెలియదు. దాన్ని మనం దొంగిలించి, దాని రహస్యం తెలుసుకుందాం," అన్నాడు.

నాగులు సరే నన్నాడు.

మర్నాడు గుడ్డివాడు అటుగా వచ్చినప్పుడు నాగులు కొమటయ్యా దుకాణం వద్ద ఉన్నాడు. వాడు గుడ్డివాడితో కొంత దూరం వెళ్ళి, "గుడ్డి అన్నా, నీ యిల్లు ఎక్కడ? పాపం, నువు రాత్రి ఎక్కడ పడుకుంటావు?" అని అడిగాడు.

"నాకు ఇల్లూ, వాకిలీ కూడానా, బాబూ? రోజూ రాత్రి పూట శ్మశానం దగ్గిర పెద్ద చెట్టు కింద పడుకుంటాను," అన్నాడు గుడ్డివాడు.

పిళ్ళా అప్పారావు

నాగులు ఈ వార్త తెచ్చి కొమటయ్యకు చెప్పాడు. తనకు తెలియకుండా నాగులు వెళ్ళి ఆ చిప్ప కాజేస్తాడేమోనని, కొమటయ్య నాగులును చీకటిపడిన దాకా తన దగ్గిరే ఉంచి, ఆ రాత్రికి తనకూ, నాగులుకూ భోజనం కూడా తెప్పించాడు.

భోజనం అయినాక కొమటయ్య దుకాణం మూసి, వరహాల సంచీ రొండిన దోపుకుని, నాగులును వెంట బెట్టుకుని శ్మశానం కేసి బయలుదేరాడు. అంత దూరాన పెద్ద చెట్టు కింద పడుకుని గుడ్డి వాడు కనిపించాడు. కొమటయ్య ఆగి పోయాడు. నాగులు ముందుకు వెళ్ళి, గుడ్డివాడి తలకింది నుంచి చిప్ప కాజేశాడు.

నాగులు కొమటయ్య దగ్గిరికి తిరిగి వస్తూ, "ఈ చిప్పలో ఏమున్నదో తెలీదు గాని, కొమటయ్య మొలలో వరహాల సంచీ ఉన్నది," అనుకున్నాడు.

వాడు దగ్గిరికి రాగానే కొమటయ్య, "నాగులూ, ఏదీ, చిప్పను చూడనీ!" అన్నాడు.

నాగులు దగ్గిరికి వచ్చి, ఆ చిప్పతో కొమటయ్య నెత్తిన బలం కొద్దీ కొట్టాడు. చిప్ప రెండు ముక్కలయింది. కొమటయ్య స్పృహతప్పి పడిపోయాడు. అతని మొల నుంచి వరహాల సంచీ లాగేసుకుని, నాగులు గబగబా వెళ్ళిపోయాడు.

కొంత సేపటికి తెలివివచ్చి కొమటయ్య అటూ ఇటూ చూశాడు. చుట్టూ ఎవరూ



లేరు. మొలలో వరహాల సంచీ మాయ మయింది. కాని ముష్టిచిప్ప ముక్కలు దొరికాయి. అవే అతనికి కావలిసింది. కొమటయ్య వాటిని తీసుకుని తిన్నగా కమసాలి ఇంటికి వెళ్ళాడు.

"ఏమండీ, కొమటయ్యగారూ? అర్ధ రాత్రివేళ వచ్చారు!" అన్నాడు కమసాలి.

"ఈ చిప్ప ముక్కల కింద కుందలు ఉన్నాయి. తీసి చూడు," అన్నాడు కొమటయ్య. కమసాలి ఆ కుందలను ఊడగొట్టి చూస్తే అవి బంగారం లాగా మెరుస్తున్నాయి.

"కొమటయ్యగారూ, ఇది ఏమంత మంచిసరుకు కాదు. నూరువరహాలిస్తాను. నాకు ఇచ్చెయ్యండి," అన్నాడు కమసాలి.

కొమటయ్య తన సంచీతో యాభై వరహాలు పోగొట్టుకున్నాడు. కమసాలి నూరు వరహాలిస్తే సగానికి సగం లాభమే. కుందలు కమసాలిని ఉంచుకోనిచ్చి, నూరు వరహాలు తీసుకుని కొమటయ్య ఇంటికి వెళ్ళాడు.

కొమటయ్యకూ, కమసాలికీ జరిగిన సంభాషణ ఇద్దరు దొంగలు విన్నారు.

కొమటయ్య వెళ్ళగానే కమసాలి కుందలను కాల్చి చూశాడు. అవి ఇత్తడి ముక్కలు. వాటిపైన పది వరహాల బంగారుపూత మాత్రం ఉన్నది.

"కొమటయ్య దగా చేశాడు. తెల్లవార గానే వెళ్ళి, నా డబ్బు తెచ్చుకుంటాను," అని కమసాలి తన భార్యతో చెప్పి,





ఆ ఇత్తడి ముక్కలను పెట్టె మీద ఉంచి, నిద్రపోయాడు.

కమసాలి నిద్రపోగానే దొంగలు కమసాలి ఇంట్లో ప్రవేశించి, పెట్టె మీద పెట్టిన ముక్కలను తీసుకుని ఊరి బయటికి పోయారు.

తెల్లవారగానే కమసాలి లేచి, ఇత్తడి ముక్కల కోసం చూశాడు. పెట్టెలన్నీ వెతికాడు, కాని అవి కనిపించలేదు. తన భార్యను అడిగితే, "రాత్రి పెట్టె మీద పెట్టారు గద!" అన్నది.

"పెట్టె మీద లేవు. మన నూరు వరహాలూ పోయాయి," అంటూ కమసాలి కొమటయ్య వద్దకు వెళ్ళి, "నాకు ఇత్తడి ముక్క లిచ్చావు. నా నూరు వరహాలూ నా కిచ్చెయ్యి," అన్నాడు.

కొమటయ్య కమసాలి కేసి అనుమానంగా చూసి, "ఆ నాలుగు ఇత్తడి ముక్కలూ ఇయ్యి, నూరు వరహాలు ఇచ్చేస్తాను," అన్నాడు.

తన డబ్బుకు ఆశ వదులుకుని కమసాలి తిరిగి వస్తుండగా ఊరి బయట దొంగ లిద్దరూ ఇత్తడి ముక్కలను పంచుకోవటంలో తగాదా పడి కొట్టుకుంటూ కనిపించారు. వాళ్ళు కమసాలిని చూసి పారిపోసాగారు.

"పట్టుకోండి! పట్టుకోండి!" అంటూ కమసాలి కేకలు పెట్టాడు.

రాజభటులు దొంగ లిద్దరినీ పట్టుకుని, కమసాలిని వెంటబెట్టుకుని రాజుగారి వద్దకు వెళ్ళారు. రాజు దొంగలను, "మీరు ఎందుకు కొట్టుకున్నారు? ఈ కమసాలి మిమ్మల్ని పట్టుకోమని ఎందుకు కేక పెట్టాడు?" అని అడిగాడు.

దొంగలు చేతులు జోడించి, "మహారాజా, మేం అర్థరాత్రి వేళ కమసాలి ఇంట ఈ ముక్కలు దొంగిలించాం. వాటిని పంచుకోవటంలో మేం తగాదా పడుతూండగా కమసాలి వచ్చి, భటులకు మమ్మల్ని పట్టి యిచ్చాడు," అని చెప్పారు.

రాజు కమసాలిని, "నీకు ఈ ముక్కలు ఎక్కడివి?" అని అడిగాడు.

"మహారాజా, నూనె దుకాణం కొమటయ్య బంగారు కుందలు అని చెప్పి, వీటిని నాకు అమ్మాడు. బంగారమే అని ఆశపడి, ముందూ వెనకా ఆలోచించక వాటికి నూరు వరహాలు ఇచ్చాను. కరిగించి చూస్తే ఇత్తడి ముక్కల మీద బంగారపు పూత! కొమటయ్య దగా చేశాడు గదా అనుకుని ఈ ఇత్తడి ముక్కలను పెట్టె మీద పెట్టాను. తెల్లవారి లేచి చూస్తే అవి పోయాయి. కొమటయ్య దగ్గిరికి వెళ్ళి అడిగితే, ఇత్తడి ముక్కలు ఇచ్చి నూరు వరహాలూ తీసుకోమన్నాడు. తిరిగి వస్తుండగా, ఈ దొంగలు ఇత్తడి ముక్కల కోసం తన్నుకుంటూ కనిపించారు," అని కమసాలి రాజుకు చెప్పాడు.

రాజు భటులను పంపి కొమటయ్యను పిలిపించి, "నీకు ఈ ముక్కలు ఎక్కడివి?" అని అడిగాడు.

కొమటయ్య తానూ, నాగులూ కలిసి గుడ్డివాడి ముష్టిచిప్ప కాజెయ్యటానికి చేసిన ఆలోచనా, నాగులు తనకు చేసిన ద్రోహమూ మొదలైన విషయాలన్నీ ఉన్నవి ఉన్నట్టు చెప్పాడు.

నాగులు ఊరు విడిచి పోయినట్టు తెలిసింది.

రాజుగారు గుడ్డివాణ్ణి తెప్పించి, "నీకు ఈ చిప్ప ఎక్కడిది?" అని అడిగాడు.

"తమ వంటి ధర్మప్రభువులు నాకు చిప్ప ఇచ్చారు. అది కాస్తా పోయింది. ఇప్పుడు ఆకులో తింటున్నాను," అన్నాడు గుడ్డివాడు.

రాజుగారు కొమటయ్యకు నూటయాభై వరహాలూ, కమసాలికి డెబ్భై అయిదు వరహాలూ జరిమానా వేసి, ఆ మొత్తం గుడ్డివాడికి ఇప్పించి, దొంగ లిద్దరినీ ఖైదులో పెట్టించాడు.

రాజుగారు యిప్పించిన డబ్బుతో గుడ్డివాడు సుఖంగా బతికాడు.





# గయ్యాళి రంగమ్మ

ఒక గ్రామంలో గయ్యాళిగా పేరుమోసిన రంగమ్మ అనే విధవరాలు ఉండేది. వెంకన్నా, భీమన్నా అని ఆమెకు ఇద్దరు కొడుకులు. ఇద్దరికీ పెళ్ళి యీడు వచ్చింది. కాని రంగమ్మ గయ్యాళి తనానికి భయపడి వాళ్ళ కెవరూ పిల్లల నిస్తామని వచ్చారు కారు.

పెద్దవాడైన వెంకన్న తమ తల్లి గయ్యాళి కావటం చేత, ఆస్తిపాస్తులున్నా తమకు సంబంధాలు రావటం లేదని ఇరుగు పొరుగు వాళ్ళ మాటలను బట్టి గ్రహించాడు.

వెంకన్న తన తల్లికి బుద్ధిచెప్పాలని అవ కాశం కోసం చూస్తూండగా ఒకనాడు పక్కింటి మనిషి తమ ఇంటి కరివేప చెట్టు ఆకులు నాలుగు గోడమీది నుంచి కోసుకోవటం చూసి రంగమ్మ ఆమె మీద విరుచుకు పడింది.

వెంకన్నకు చిరాకు పుట్టి, "అమ్మా, ఆవిడ ఆ కరివేపాకు దొంగిలించిందే అనుకో, దానికి ఇంత రాద్ధాంతం చెయ్యాలా? చెట్టున ఉన్న ఆకంతా మనం ఏం చేసుకుంటాం? చెట్టునే ఎత్తుకు పోలేదు గదా? ఆకు కోస్తే మళ్ళా చిగురు పెట్టదూ? ఇంతలోనే మన కొంప మునిగి పోలేదుగా! నువు నీ పద్ధతి మార్చు కోవాలి. నీ మూలంగానే మాకు పెళ్ళిళ్లు కావటం లేదు. మా కన్న చిన్నవాళ్ళు పిల్లల తండ్రు లయారు. పిల్లలతో కళ కళ లాడవలిసిన కొంప దయ్యాలకొంప లాగుంది!" అనేశాడు.

ఈ మాటకు రంగమ్మ మరింత రెచ్చి పోయి, "కని పెంచి పెద్దవాణ్ణి చేసిన నా నేటికే తాళం వేయాలనిచూస్తున్నావా? అంత పొగరుగా ఉంటే నీ భాగం నువు తీసుకుని వేరే బతుకు, పో!" అన్నది.

వేమూరు వెంకయ్యనాయుడు

ఆ మాట అనిపించుకుని, వెంకన్న తమ ఆస్తిని మూడు భాగాలు చేసి, ఒక భాగం తల్లికీ, ఒక భాగం తమ్ముడికీ ఇచ్చి, తాను వేరుపడ్డాడు. వెంటనే అతనికి పిల్లనిస్తామని చాలామంది ముందుకు వచ్చారు. వెంకన్న ఒక గ్రామంలో ఒక పిల్లను చూసి, తనకు నచ్చిందని తన తల్లిని కూడా అక్కడికి పోయి చూసి రమ్మన్నాడు.

"కుండ వేరైతే కులమూ వేరే అయింది. నువు నా కొడుకువు కాదురా, గర్భశత్రువువి!" అని రంగమ్మ కొడుకు మీద గుడ్లు ఎర్ర చేసింది.

వెంకన్న వెళ్ళిపోయి, తనకు నచ్చిన పిల్లను పెళ్ళిచేసుకుని, ఆమెతో కాపరం పెట్టాడు. కొంతకాలమయాక వెంకన్న భార్య గర్భవతి అయి, పురిటికి పుట్టింటికి పోయింది. వెంకన్న తన తల్లివద్దకు పోయి, "అమ్మా, నా భార్య పుట్టింటికి వెళ్ళింది. నాకు వంట చేతకాదు. అది తిరిగి వచ్చేదాకా మీ ఇంట్లో తింటాను. అందుకయే ఖర్చు కూడా ఇస్తాను," అన్నాడు.

రంగమ్మ కొంచెం ఆలోచించి, "నీకు పెట్టటానికేం అభ్యంతరంగాని, నా వంతు ఆస్తి అంతా నీ తమ్ముడి పేర ఏనాడో రాశాను. వాడు ఏమంటాడో వాణ్ణి అడిగి చూడు," అన్నది.

తల్లి కుట్రబుద్ధితో ఈ మాట అన్నదని వెంకన్న చాలా బాధపడ్డాడు.



అతను తన ఇంటికి తిరిగిపోయి, సొంతంగా వండుకుంటూ, ఇరుగమ్మా పొరుగమ్మా ఇచ్చే కూరా, నారాతో తిండి గడుపుకుంటూ కాలం గడిపాడు.

కొంతకాలానికి వెంకన్న భార్య మగ పిల్లవాణ్ణి ఎత్తుకుని తిరిగి వచ్చింది. వెంకన్నకు రోజులు మళ్ళీ హాయిగా గడవసాగాయి.

ఈ సమయంలో రంగమ్మకు పెద్ద జబ్బు చేసి, మంచాన పడింది. భీమన్న తల్లి వంతు ఆస్తితో రెండు చేతులా సంపాదిస్తూ కూడా, పదిరూయలు ఖర్చు పెట్టి తల్లిని వైద్యుడికి చూపించక పోయాడు.

తల్లికి జరుగుతున్న ఈ అన్యాయం గురించి తెలిసి సహించలేక వెంకన్న ఆమెను చూడబోయి, "అమ్మా, నీకు జబ్బు చేసిందట. ఎలా ఉంది?" అని అడిగాడు.

"వచ్చావా, నాయనా? నన్ను నీ యింటికి తీసుకుపోరా! ఇది దయ్యాల కొంప. ఇక్కడ ఒక్క క్షణం ఉండలేను," అన్నది రంగమ్మ.

తల్లి మునుపు అన్నమాట జ్ఞాపకం వచ్చి వెంకన్న, "అమ్మా, నిన్ను నా యింటికి తీసుకు పోవటానికి నా కేమీ అభ్యంతరం లేదుగాని, ఆస్తి అంతా నా భార్య పేర రాశాను. దాన్ని అడిగి చెబుతాను," అన్నాడు.

తన తప్పు తెలుసుకుని రంగమ్మ కొడుకును ఏమీ అనలేక దిగాలుపడి చూస్తూ వూరుకున్నది.

వెంకన్న భీమన్నను పిలిచి, తల్లి ఆస్తి తింటూ ఆమెను చూసేది ఇలాగేనా అని మందలించాడు. అతను తల్లిని తన యింటికి తీసుకుపోయి, ఆమె జబ్బు నయం చేయించి, తన వద్దనే ఉంచుకున్నాడు.

అటుతరవాత రంగమ్మ తన గయ్యాళితనం కట్టిపెట్టి, ఇరుగు పొరుగు వారందరితోనూ ఎంతో మర్యాదగా ఉంటూ వచ్చింది.





# పిసినారి

ఒక గ్రామంలో ఎనభై ఏళ్ళ ముసలిది ఒకతె ఉండేది. ఆమెకు ఎవరూ లేరు. ఆమె ఉండే విశాలమైన్న ఇంటి చుట్టూ ఒక ప్రహరీగోడ ఉండేది. ఆవరణలో చాలా పళ్ళచెట్లు ఉండేవి. వాటిలో రెండు ఆపిల్ పళ్ళ చెట్లు. అవి కాశ్మీరు జాతి చెట్లు. వాటికి ఉత్తమ జాతి ఆపిల్ పళ్ళు కాసేవి. ఆవిడ భర్త చనిపోతూ ఆమెకు బోలెడంత ఆస్తి ఇచ్చిపోయాడు. అయితే ఆమె పిసినారి కావటంచేత చూస్తూ చూస్తూ ఒక్క దమ్మిడీ ఖర్చు చేసేది కాదు. ఆమె తన కడుపుకు ఇంత తినేది కూడా కాదు; తన దొడ్లో మొలిచే ఆకులూ, అలములూ ఉడక బెట్టి తినేది; చివరకు తన చెట్లకు కాసే ఆపిల్‌పళ్ళు కూడా ఎన్నడూ రుచిచూసి ఎరగదు, కోతకు రాగానే వాటిని అమ్మి, డబ్బు ఇనపపెట్టెలో భద్రపరిచేది.

ఆమె ఇంటికి దగ్గిరలో ఉండే సామాన్య కుటుంబాలకు చెందిన పిల్లలు అల్లరికి ప్రహరీగోడ దూకి తోటలోకి ప్రవేశిస్తే ముసలావిడ వాళ్ళను తరిమేది. తన చెట్లకు కాసే పళ్ళు కుళ్ళినా ఆమెకు అభ్యంతరం లేదు గాని, చూస్తూ చూస్తూ పిల్లలకు ఒక్క పండు ఇచ్చిన పాపాన పోయేదికాదు. ఆమె పేరు ఉచ్చరిస్తే కుండలు బద్దలవుతాయనీ, పొద్దునే లేచి ఆమె ముఖం చూస్తే ఆ రోజుకు తిండి ప్రాప్తి ఉండదనీ, ఆమెను గురించి చుట్టుపక్కల వాళ్ళు ద్వేషంతో చెప్పుకునేవారు.

ఆ ముసలామె పేరు గుణవతి. ఆమె ఉండిన గ్రామం పేరు సంయుక్తా.

ఆ గ్రామంలో సులాల్ అనే కుర్రవాడుండే వాడు. వాడు గ్రామాధికారి కొడుకు. వాడు ఒక పిల్లల జట్టును

పి. సి. సర్కార్, ఐంద్రజాలికుడు



గ్రామాధికారి కొడుకు సులాల్ బస్తీలో హైస్కూలులో పై తరగతులలో చదువుతూ, హాస్టల్‌లో ఉంటూ, శలవులకు ఇంటికి వచ్చి పోతూ ఉండే వాడు. త్వరలోనే శలవులు ముగియటం చేత వాడు బస్తీకి తిరిగి వెళ్ళాడు. ముసలావిడకు బుద్ధి చెప్పాలన్న నిర్ణయం అమలు జరగలేదు. అయితే హాస్టలుకు తిరిగి వచ్చినాక కూడా వాడికి ఆ ఆలోచన పోలేదు. ఆ ఆలోచన మూలంగా వాడికి పరధ్యానం ఏర్పడింది.

వెంట బెట్టుకుని వచ్చి, ముసలామె ఇంటి ప్రహరీ గోడ దూకాడు. చెట్ల మీద ఆపిల్‌పళ్ళు చక్కగా పండబారి ఉన్నాయి. పిల్లలు ఆపిల్‌చెట్లు ఎగబాకి, పళ్ళు కొరికే లోపల గుణవతి పెద్ద గడతో వచ్చి పడింది. ఆమె, "ఎవరవ్రా అదీ?" అని అరిచే సరికి, పిల్లలు చెట్ల మీది నుంచి దూకి, బెదిరి కాలిసత్తువ కొద్దీ పారిపోయారు.

సులాల్ ఎగరొప్పుతూ, "ఈ ముసలి దానికి ఎలాగైనా బుద్ధి చెప్పాలి," అన్నాడు.

"అవును, చెప్పాలి," అన్నారు మిగిలిన పిల్లలు.

సులాల్ ఉండే హాస్టల్ గదిలో అధీర్ అనే చురుకైన విద్యార్థి, సులాల్ కన్న కొంచెం పెద్దవాడు, ఉండే వాడు. వాడు సులాల్‌ను, "ఏమిత్రా నీ బాధా?" అని అడిగాడు.

"బాధా? అలాంటిదేమీ లేదే!" అన్నాడు సులాల్.

"నన్ను ఏమారుస్తావా? ఏదో ఉంది. నేను కనుక్కోలే ననుకున్నావురా, సులాల్? మా నాన్న ఇంద్రజాలం తెలిసిన వాడు, నేనూ ఇంద్రజాలికుణ్ణి కాబోతున్నాను, తెలుసా? నువు అస్తమానమూ ఏదో ఆలోచిస్తున్నావు. నిన్ను బాధించే సమస్య ఏమిటి? దానికి ఏదో ఒక పరిష్కారం నేను చెబుతాను," అన్నాడు అధీర్.

సులాల్ కళ్ళు సంతోషంతో మెరిశాయి. గుణవతికి బుద్ధివచ్చేటట్టు చేసే మార్గం అధీర్ చెప్పగలడు. వాడు తెలివైన వాడు. వాడిది పాదరసం లాటి బుద్ధి. పైపెచ్చు వాడికి ఇంద్రజాలం తెలుసు. ఆ ఇంద్రజాలంతో వాడు గుణవతిని బోల్తా కొట్టించవచ్చు.

"నా సమస్య గుణవతి," అన్నాడు సులాల్.

అధీర్ కోపం తెచ్చుకుని, "ఇప్పటి నుంచే నీకు ఆడవాళ్ళ సమస్యలా?" అన్నాడు.

"ఈ ఆడది ఎనభైఏళ్ళది. మా అమ్మమ్మకు అమ్మమ్మ కాదగినది అనుకో," అన్నాడు సులాల్.

అధీర్ విరగబడి నవ్వి, "ఆ మాట ముందు చెప్పావు కావేం?" అన్నాడు.

సులాల్ అధీర్‌కు జరిగిన సంగతంతా చెప్పాడు. అప్పటి కప్పుడే ఒక పథకం కూడా తయారయింది.

మూడు వారాల అనంతరం, స్కూలుకు చిన్న శలవులప్పుడు, ఒకనాటి ఉదయం గుణవతి ఇంటికి ఒక ముసలి సాధువూ, ఆయన శిష్యుడూ వచ్చారు. ముసలి సాధువు తలవాకిలి వద్ద నిలిచి, "అన్నపూర్ణమ్మ తల్లీ! మీ ఇంటికి వచ్చాను, తలుపు తియ్యి," అని కేకపెట్టాడు.

"ముష్టి వెధవా! పో అవతలికి! నీ కేమీ వేసేది లేదు," అని గుణవతి లోపలి నుంచి అరిచింది.





"అమ్మా, నాకు బిచ్చం అక్కర్లేదు. నీకొక వరం ప్రసాదించమని కైలాసం నుండి నన్ను మహాశివుడు పంపాడు. తలుపు తీసి వరం గ్రహించు, నేను మళ్ళీ త్వరగా వెళ్ళాలి," అన్నాడు సాధువు.

ఈ మాట గుణవతిని ఎంతో ఆకర్షించింది. ఆమెకు ఇవ్వటంకన్న తీసుకోవట మంటే మహా ఆసక్తి. ఆమె తలుపు తెరిచి, సాధువునూ, శిష్యుణ్ణీ లోపలికి రానిచ్చింది.

సాధువు తన గుడ్డసంచీ నుంచి బూడిద పొట్లం ఒకటి పైకి తీసి, "ఇది శివుడి అగ్నివేదిక నుంచి తీసిన బూడిద. దీన్ని నీళ్ళలోకలిపి మూడు రాత్రులు వరసగా నీ ఆపిల్‌చెట్ల మొదళ్ళమీద చల్లు. ఆపిల్ పళ్ళ విలువ ఎలా పెరిగి పోయేదీ నీకే తెలుస్తుంది. ఇది శివుడి ఆజ్ఞ. ఆజ్ఞ మీరితే నీ ఏడుతరాల వాళ్ళకు నరకం తప్పదు. గుర్తుంచుకో. ఈ భస్మం మహిమ చూపించటానికి మూడు రోజుల తరవాత నేను మళ్ళీ వస్తాను," అని చెప్పి, శిష్యుడితో బాటు వెళ్ళిపోయాడు.

ఏడు తరాలవాళ్ళు నరకానికి పోవటం ఇష్టం లేక, గుణవతి సాధువు చెప్పినట్టే చేసింది.

మూడు రోజులు గడవగానే సాధువూ, శిష్యుడూ వచ్చారు. సాధువు గుణవతి చేత ఆమె చెట్టున కాసిన ఆపిల్‌పండు ఒకటి తెప్పించాడు. ఆయన తన సంచీ నుంచి ఒక పెద్ద కత్తి పైకితీసి, "అమ్మా, జాగ్రత్తగా గమనించి, నీ అదృష్టం ఎలాటిదో చూసుకో. 'స్క్రిటింఘి' అనే గుణ మంత్రం శుద్ధంగా ఉచ్చరించి ఈ ఆపిల్‌ను కోస్తే ఏం జరుగుతుందో చూడు," అని మంత్రం ఉచ్చరిస్తూ, పండులోకి కత్తిని నింపాదిగా దించాడు. పండు రెండు భాగాలు అయేటప్పుడు అందులో ఒక బంగారునాణెం కనబడింది. గుణవతి మరొక ఆపిల్ పండు తెచ్చింది. దాన్ని కోసినప్పుడు కూడా అందులో ఒక బంగారునాణెం కనబడింది.

"అమ్మా, నువు అదృష్టవంతురాలివి. ఇప్పుడిక ఏమీ చెయ్యకు. ఆపిల్ పళ్లన్నిటినీ గదిలోకి చేర్చు. రాత్రిపూట గదిని పూర్తిగా చీకటి చేసి, పళ్ళ నన్నిటినీ రెండుగా కోస్తూ పో. బంగారు నాణాలు పోగు చేసే పని పెట్టుకోకు. మంత్రం మటుకు శుద్ధంగా ఉచ్చరించాలి, ఆ మాట గుర్తుంచుకో. ఇక నేను పోతాను. ఈ బంగారు నాణాలు రెండూ దేవుడి నివేదనకు ఉంచుకుంటాను. సుఖీభవ! సుఖీభవ!" అంటూ సాధువు వెళ్ళిపోయాడు.

గుణవతికి తాను చూసిన అద్భుతంలో పూర్తి విశ్వాసం కుదిరింది. ఆమె ఆపిల్ పళ్ళ నన్నిటినీ కోయించి, తెల్లవార్లూ కటిక చీకట్లో కూర్చుని వాటి నన్నిటినీ కత్తితో రెండుగా సరికింది; మధ్య మధ్య తన చేతి వేళ్ళు కూడా కోసుకున్నది. అయితే తెల్లారే సరికి ఆమెకు పూర్తిగా ఆశాభంగం అయింది. ఆపిల్ పళ్ళన్నీ పాడయాయే తప్ప వాటిలో నలుసంత బంగారం కూడా లేదు.

"ఆ మంత్రం సరిగా ఉచ్చరించి ఉండను. నోరు తిరిగే మాట కూడా కాదాయే!.... ఇప్పుడీ పళ్ళన్ని ఏం చెయ్యాలి? వీటిని ఎవరు కొంటారు?" అనుకున్నది గుణవతి.

ఇంతలో ఆమెకు గ్రామంలో ఉండే పిల్లలు గుర్తువచ్చారు. వాళ్ళే వచ్చి అంతా శుభ్రంగా తినిపోతారు. గది



శుభ్రం చేసే పని కూడా ఉండదు. ఇలా అనుకుని గుణవతి ఇంటి బయటికి వచ్చి, పిల్లల్ని కేక పెట్టింది. పిల్ల లందరూ ఒక్కసారి గుణవతి ఇంటి మీద వచ్చిపడి, ఆపిల్‌పళ్ళ బద్దలను ఆత్రంగా తినసాగారు.

ఆ సమయంలో ఆ పిల్లలను చూస్తున్న గుణవతి హృదయంలో ఎన్నడూ లేని ఒక వింత వాత్సల్యం పుట్టుకొచ్చింది. ఆమె మనసు ఆనంద డోలికల్లో ఊగిపో సాగింది. పిల్లల ముఖాలలోని ఆనందం అలా చూడటం ఆమె జీవితంలో యిదే మొదటిసారి.

"పిల్లలకు పెట్టటంలో ఇంత ఆనందం ఉన్నదా?" అని గుణవతి ఆశ్చర్య పోయింది.

అది మొదలు గుణవతి స్వభావం పూర్తిగా మారిపోయింది. ఆమె ఇంటికి పక్క గ్రామాల పిల్లలు కూడా రాసా గారు. ఆమె పళ్ళతోటలో వాళ్ళకు పూర్తి స్వేచ్ఛ ఉండేది....

"పళ్ళలో బంగారు నాణాలు ఎలా తెప్పించావు? ఆ రహస్యం ఏమిటి, అధీర్?" అని సులాల్ అడిగాడు.

"పెద్ద రహస్యమేమీ లేదు. చాలా తేలికైన ట్రిక్కు. అందరూ చేస్తారు. సాధువు వేషంతో ముసలావిడ ఇంటికి బయలుదేరే టప్పుడు ఒక కత్తితో బయలు దేరాను. ముందుగానే ఆ కత్తి పిడికి దగ్గిరలో రెండు బంగారు నాణాలు మైనంతో అంటించాను. ఆపిల్‌పళ్ళు కోసేటప్పుడు నాణాలు అంటించిన పక్క ఆమెకు కనపడకుండా పట్టుకుని, కత్తిమొన పండులోకి గుచ్చి నొక్కుతూ, జాగ్రత్తగా నాణాన్ని కత్తి నుంచి ఊడ దీసి, పండు చీలికలోకి తోసేశాను. ఇప్పుడంతా అర్థమయింది కాదూ?" అన్నాడు అధీర్....

గుణవతి మరో పదేళ్ళు బతికింది. ఆ పదేళ్ళలోనూ ఆమె తన ధనాన్ని గ్రామం కోసమూ, ప్రత్యేకించి పిల్లల కోసమూ ధారాళంగా ఖర్చు చేసింది.





# మారిన మనిషి

పూర్వం కళింగపట్టణంలో మహాజనుడు అనే గొప్ప వర్తకుడు ఉండేవాడు. ఆయన వ్యాపారదక్షత గలవాడు కావటమే గాక న్యాయనిర్ణయం చెయ్యటంలో పేరు ప్రఖ్యాతులు గడించినవాడు. అనేక మంది తగాదాలు పడి, ఆయన వద్దకు వచ్చి, ఆయన చేసిన నిర్ణయాన్ని శిరసావహించే వాళ్ళు. ఈ విధంగా ఆయనకు ప్రజలలో గొప్ప పలుకుబడి ఉండేది.

మహాజనుడికి శంభుడు అని ఒక కొడుకు ఉండేవాడు. వాడికి తండ్రి తెలివి తేటలు ఏవీ పట్టుబడ లేదు గాని, ధనవంతుడి కొడుకుకు అలవడ దగిన తాగుడూ, జూదమూ, వ్యభిచారమూ లాటి దురలవాట్లన్నీ పట్టుబడ్డాయి. వాడి దురలవాట్లు మాన్పటానికి మహాజనుడు చేసిన హితబోధలన్నీ బూడిదలో పోసిన పన్నీరు అయాయి. తండ్రి సంపాదించుకున్న కీర్తి ప్రతిష్ఠలను శంభుడు నీట గలపసాగాడు.

కొడుకు సమస్య మహాజనుణ్ణి బాధించింది. ఒక్క కొడుకు కావటం చేత ఆయన వాణ్ణి తీవ్రంగా శిక్షించ లేదు. వాడి బుద్ధి చెడ్డది కాదు. వాడికి తండ్రి మీద ప్రేమకూడా ఉన్నది. కాని తండ్రి హితబోధలు వాడి చెవికి ఎక్కవు. పైగా దుర్వ్యసనాలకు వాడు బానిస అయిపోయాడు. మహాజనుడు బాగా ఆలోచించి, కొన్నాళ్ళు శంభుడికి దూరంగా ఉందామనీ, తన అండలేకపోతే వాడు మారవచ్చుననీ నిశ్చయించుకున్నాడు.

ఒకరోజు ఆయన శంభుడితో, "చూడు, నాయనా! నేను సముద్రవ్యాపారం మీద చాలా దూరం పోతున్నాను. అందుకని దగ్గిర ఉన్న డబ్బు అంతా పట్టుకు పోతున్నాను," అన్నాడు.

బూర్లె నాగేశ్వరరావు



శంభుడు ఈ మాటవిని దిగులుపడి, "డబ్బు లేకపోతే నాకు ఎలా?" అన్నాడు.

"అవును, బాబూ. దానికోసమే గదా పోతున్నాను? డబ్బు సంపాదించటానికి పెట్టుబడి కావాలిగా? అయినా నువ్వేమీ దిగులుపడకు. నీకు కావలిసిందంతా అప్పు చెయ్యి. నేను తిరిగి వచ్చాక తీరుస్తాను," అని చెప్పి, మహాజనుడు బయలుదేరి వెళ్ళాడు.

తండ్రి వెళ్ళిపోవటంతో శంభుడికి మరింత స్వేచ్ఛ వచ్చినట్టయింది. వాడు మరింత ఉత్సాహంగా తన దుర్వ్యసనాలలో మునిగి తేలసాగాడు. అందుకు అవసరమైన డబ్బుకోసం దొరికిన చోటనల్లా అప్పు చేశాడు. కాని కొంతకాలం గడిచాక సాటివర్తకులు అప్పులు నిరాకరించారు. అయినా శంభుడు లక్ష్యపెట్టక, ఇంట్లో ఉండే నగా, నట్రా అమ్మి తన ఖర్చులు గడుపుకోసాగాడు.

ఇలా ఉండగా, ఒకనాడు శంభుడి వద్దకు ఇద్దరు నావికులు వచ్చి, "అయ్యా, ఏం చెప్పమన్నారు? కొద్ది రోజుల క్రితం మీ నాన్నగారి నౌక సముద్రంలో మునిగి పోయింది. అందరూ పోయారు. సరుకంతా సముద్రం పాలయింది. మే మిద్దరమూ ఎలాగో ప్రాణాలు దక్కించుకుని బయట పడ్డాం," అంటూ కంటతడి పెట్టారు.

ఈ వార్తవిని శంభుడు నిలువునా కుంగిపోయాడు. ముందు ఏం జరగబోయేదీ అతనికి అంతుబట్ట లేదు. కాని త్వరలోనే అతనికి తన పరిస్థితి అనుభవపూర్వకంగా తెలిసిరాసాగింది.

మహాజనుడు పోయినవార్త తెలిసి నగరంలోని వర్తకులు తమకు మహాజనుడు బాకీ ఉన్న అప్పులన్నీ శంభుడి నుంచి వసూలు చేసుకోసాగారు. ఆ బాకీలు తీర్చటానికి శంభుడు తన ఇల్లు తప్ప మిగిలిన ఆస్తి అంతా అమ్మవలిసి వచ్చింది, కాని ఇంకా కొత్త అప్పులు వస్తూనే ఉన్నాయి.

శంభుడు కంగారుపడి, తనకు రావలిసిన బాకీలు ఏమి ఉన్నాయోనని పద్దుల పుస్తకాలు తిరగవేశాడు. వసూలు కావలిసిన బాకీలు కూడా చాలా వున్నాయి. శంభుడికి తిరిగి ఆశకలిగింది. ఆ బాకీలు వసూలు చేసుకురమ్మని అతను మనుషులను పంపాడు. అయితే ఒక్క బాకీ కూడా వసూలు కాలేదు; తాము ఆ బాకీలు ఏనాడో తీర్చామనీ, అవి తీరినట్టు మహాజనుడు తమ కిచ్చిన రశీదులు ఉన్నాయనీ బాకీదార్లు అన్నారు.




తన తండ్రి చేసిన అప్పులు తాను తీర్చేమార్గం లేకుండా పోయేసరికి శంభుడికి ఒక అనుమానం వచ్చింది. తన తండ్రి ఇన్ని అప్పులు ఎందుకు చెయ్యవలసి వచ్చింది? అవన్నీ దొంగ పత్రాలని అనుమానం తగిలి అతను వాటిని నిపుణులచేత పరీక్షచేయించాడు. నిపుణులు ఆ పత్రాలను పరీక్షించి, వాటి మీది సంతకాలన్నీ మహాజనుడివేనని చెప్పారు.

శంభుడు తన తండ్రి చేసిన అప్పులు తీర్చలేకపోయాడు. అప్పుల వాళ్ళు పత్రాలు తీసుకుని అతని వద్దకు రావటం మానేశారు. వారితోబాటు శంభుడి పాత మిత్రులు కూడా రావటం మానేశారు. ఆఖరుకు నగరంలో ఒక కాకి కూడా అతని ఇంటి మీద వాలటం మానేసింది. అందరూ తనను వెలివేసినట్టయి, శంభుడు చాలా బాధ పడ్డాడు. మానసికంగా అతనిలో పెద్ద మార్పు కలిగింది. అతను గడచినదంతా ఒక పీడ కలగా భావించి, పేదవాడుగా బతకటం నేర్చుకున్నాడు. ఇదే నిజమైన బతుకు అని అతనికి అనిపించింది.

ఇలా ఉండగా ఒకనాడు శంభుడి పుట్టిన రోజు వచ్చింది. అతను తన పుట్టిన రోజు పండగ చేసుకునే ఆలోచనలో లేడు. కాని అతని నిమిత్తం లేకుండా పెద్ద ఎత్తున పండగ ఏర్పాట్లు జరగసాగాయి. ఎవరో వచ్చి, ఇల్లంతా ఇంద్ర

భవనం లాగా అలంకరించారు. అతను పిలవకుండానే ఎక్కడెక్కడినించో బంధుబలగం వచ్చేసింది.

ఇల్లంతా పెళ్ళిసందడి చూసి శంభుడు విస్మయం చెందాడు. నగరంలోని వర్తకులంతా వచ్చి కూర్చున్నారు. శంభుడికి ఆశ్చర్యంతోబాటు ఆనందం కూడా కలిగింది. వాళ్ళనందరినీ చూస్తూంటే అతనికి తండ్రి జ్ఞాపకం వచ్చి, దుఃఖం ముంచుకొచ్చింది.

అదే క్షణంలో మహాజనుడు ఎక్కడినుంచో వచ్చి శంభుణ్ణి కౌగలించుకున్నాడు. శంభుడు తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు.

"అవును, బాబూ. నేను బతికే ఉన్నాను. నిన్ను అనుక్షణం కనిపెడుతూనే ఉన్నాను. నీలో మార్పు తీసుకురావటానికి ఈ నాటకం ఆడవలసి వచ్చింది," అన్నాడు మహాజనుడు.

శంభుడు తండ్రి కాళ్ళ మీద పడి, "ఇంత కాలమూ మీ మనసును ఎంత బాధ పెట్టానో ఇప్పుడు తెలిసి వచ్చింది. ఇక ఎన్నడూ అలా చేయను," అన్నాడు.

మహాజనుడి కళ్ళలో ఆనందబాష్పాలు నిలిచాయి. అది చూసి శంభుడు తల దించేసుకుని, "నేనైతే మారాను గాని, మనం ఇప్పుడు చాలా బీదవాళ్లం. అప్పుల వాళ్ళు వచ్చి, అంతా పట్టుకుపోయారు. మనకు బాకీలున్న వాళ్ళు మీ సంతకాలతో రశీదులు చూపించారు. వాటిని మీరు కూడా పరీక్ష చెయ్యండి," అన్నాడు.

మహాజనుడు నవ్వుతూ, "ఆ పత్రాలూ, రశీదులూ వాళ్ళు సృష్టించినవి కావు, నేను సృష్టించినవే. అయితే అవేవీ నిజం కాదు. నీ దగ్గిర డబ్బు లేకుండా చెయ్యటానికి చేసిన ప్రయత్నం. మన డబ్బంతా నా వద్దనే ఉన్నది," అన్నాడు.

తన అవివేకం వల్ల సర్వనాశనం కలగకుండా తండ్రి జాగ్రత్త పడినందుకు శంభుడు సంతోషించి, తండ్రికి నచ్చిన విధంగా మసలుకుంటూ మంచి పేరు తెచ్చుకున్నాడు.



# హాస్యగాడు

పూర్వం ఒక గ్రామంలో ఒక హాస్యగాడు ఉండేవాడు. అతను అందరినీ తన ఛలోక్తులతో నవ్విస్తూ, అందరికీ ఇష్టుడుగా ఉండేవాడు.

ఆ గ్రామంలోనే ఒక మోతుబరి ఉన్నాడు. ఆయన వేటలో ఆరితేరినవాడు. ఒక ఏడు తెగుళ్ళ వల్ల ఆయన పంట అంతా దెబ్బతిన్నది. ఆ దిగులుతో ఆయన మంచం పట్టాడు.

ఈ సంగతి తెలియగానే హాస్యగాడు ఆయనను చూడబోయి, అదుర్దాగా, "బాబుగారూ, కొండ మీది నుంచి పులి దిగి వచ్చి మా ఇంట్లో జొరబడింది. తమరు వచ్చి, దాన్ని కొట్టి, మమ్మల్ని కాపాడాలి," అన్నాడు.

"పంటంతా పాడై దిగులుతో నేను తీసుకుంటూ ఉంటే, నన్నిప్పుడు పులిని కొట్ట మంటా వేంరా? ఇంకెవరి నన్నా పిలు," అన్నాడు మోతుబరి.

హాస్యగాడు ఆశ్చర్యంగా, "దిగులు పులి కన్న కూడా భయంకరమైనదా, బాబుగారూ?" అన్నాడు.

దానితో మోతుబరికి పౌరుషం వచ్చి, మంచం మీది నుంచి లేచి, "ఏదీ తుపాకీ?" అన్నాడు.

హాస్యగాడు ఆయనను వారిస్తూ, "పులి లేదు లెండి. పులిని కొట్టగలవాడు దిగులుకు ఎలా తలవంచాడా అని తెలుసుకోవటానికి అన్నాను!" అన్నాడు.

మోతుబరి నవ్వి, దిగులుమానేసి, మామూలుగా తిరగసాగాడు. —ఎం. కె.ఎస్. బాబు





# సౌందర్యపోటీ

సరస్వతి ధనవంతుల బిడ్డ. ఆమె తల్లి చిన్న తనంలోనే పోయింది. ఒక్కగా నొక్క బిడ్డ కావటం చేత తండ్రి ఆమెను చాలా గారాబంగా పెంచి, తల్లిలేని లోటు తెలియకుండా చూశాడు. ఆమెకు యుక్త వయసు వచ్చింది. తండ్రి ఆమె కోసం సంబంధాలు చూస్తున్నాడు.

సరస్వతి ప్రతిరోజూ సాయంకాలం ఊరి చివర, కొండ మీది కాళికాలయానికి వెళ్ళి, అక్కడ కోనేట్లో కాళ్ళు కడు క్కుని, దేవిని దర్శించుకుని, కొండ మీది నుంచి దూరంగా కనబడే అడవిని చూస్తూ కూర్చుని, చీకటి పడేవేళకు ఇంటికి తిరిగి వచ్చేది.

వరసగా నాలుగురోజుల పాటు ఒక యువకుడు సరస్వతి కన్న ముందుగానే వచ్చి, కోనేటి గట్టు మీద కూర్చుంటు న్నాడు. ఈ సంగతి సరస్వతి గమ నించింది. అయిదో రోజు అతను సర స్వతిని సమీపించి, "నా పేరు భూపతి. నీ పేరు సరస్వతి అని నాకు తెలుసు. నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను," అన్నాడు.

సరస్వతి కొంచెం కంగారుపడి, "మా నాన్నతో మాట్లాడు," అని చెప్పి, వడి వడిగా కొండ దిగి పోయింది.

మర్నాడు భూపతి సరస్వతి తండ్రి వద్దకు వచ్చి తన కోరిక తెలియజేశాడు. అతను సరస్వతిని పెళ్ళాడ గోరుతున్నా డని తెలిసి సరస్వతి తండ్రి, అతన్ని రెండు రోజులపాటు తమ ఇంట అతిథిగా ఉండమన్నాడు.

భూపతి వారి యింట రెండు రోజులు గడిపాడు. ఈ రెండు రోజుల పరిచయంతో సరస్వతి మనస్సు భూపతికి అను కూలంగా మారింది. కాని మూడవ రోజు

ఎం. కామేశ్వరరావు

ఉదయమే ఆమె తండ్రి భూపతితో, ''ఇక నువు వెళ్ళవచ్చు. నీకూ సరస్వతికీ వివాహం జరగదు,'' అని చెప్పేశాడు.

ఆ రోజు సాయంకాలం సరస్వతి కోనేటి గట్టున భూపతిని కలుసుకుని తన తండ్రి ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకున్నది.

''ఇక ఆ ప్రసక్తి అనవసరం. నీ కిష్టమైతే చెప్పు. ఇద్దరమూ ఆ అడవి దాటి వెళ్ళిపోయి, ఎక్కడైనా సుఖంగా బ్రతుకుదాం,'' అన్నాడు భూపతి.

సరస్వతి సంశయిస్తూ, ''మనం బ్రతికే దారి ఏమిటి?'' అని అడిగింది.

''నీ కెందుకా భయం? నేను కాయకష్టం చేసి అయినా సరే మన ఇద్దరి పొట్టలూ నింపుతాను," అన్నాడు భూపతి.

మర్నాడు అదే సమయానికి తన నిర్ణయం చెబుతానని భూపతికి మాట ఇచ్చి, సరస్వతి ఇంటికి వెళ్ళిపోయింది.

మర్నాడు అదే స్థలంలో ఇద్దరూ కలుసుకున్నప్పుడు సరస్వతి భూపతితో, ''మా నాన్న మన పెళ్ళికి ఎంత మాత్రమూ ఒప్పుకోవటం లేదు. మనం వెళ్ళిపోదాం పద,'' అన్నది.

ఇద్దరూ కొండ అవతలి పక్కకు దిగి, అడవి కేసి నడక సాగించారు. చీకటి పడింది. క్రూరమృగాల అరుపులు వినిపిస్తున్నాయి. ఇద్దరూ భయంగా నడుస్తున్నారు. ఆ రాత్రి ఎక్కడ గడపాలా అని భూపతి ఆలోచిస్తున్నాడు.




ఇంతలో సరస్వతి దూరాన మినుకు మినుకు మంటున్న దీపం చూసింది. అక్కడ ఏదన్నా ఇల్లు ఉంటుందని, ఇద్దరూ దాని కేసి నడిచారు. వాళ్ళు ఒక పాడు పడిన కొంప చేరుకున్నారు. దాని గూట్లో వెలిగే గుడ్డి దీపమే వాళ్ళు చూసినది. ఇంటి బయట ఒక అరుగు వున్నది. ఇంటి తలుపులు చేరవేసి ఉండి, భూపతి తొయ్యగానే తెరుచుకున్నాయి. లోపలి గది నిండా ఎలుక కన్నాలున్నాయి. దాని వెనక రెండు చిన్న గదులున్నాయి.



ఒక గదిలో ఒక నడుము వంగిపోయిన ముసలాడు ఉన్నాడు. వాడు కూర్చుని ఉన్న మంచం పక్కగా నాలుగు రేకు పెట్టెలు, ఒక దాని మీద ఒకటి పేర్చిపెట్టి ఉన్నాయి. ముసలాడు వాళ్ళిద్దరినీ చూసి తుళ్ళిపడి, "ఎవర్రా మీరు? మీకు మంచీ, మర్యాదా తెలీదా? చెప్పకుండా లోనికి వచ్చేస్తారా?" అన్నాడు కోపంగా.

భూపతి పశ్చాత్తాపంతో, "తలుపు తెరిచి ఉంటే వచ్చేశాం. ఈ రాత్రికి ఇక్కడ కాస్త ఆశ్రయం దొరుకుతుందా?" అని అడిగాడు.

"దొరకదు," అని ముసలాడు ఖచ్చితంగా చెప్పాడు.

"ఆడమనిషి, రాత్రివేళ అడవిలో నడవటానికి భయపడుతోంది," అని భూపతి బతిమాలాడు.

"సరే, అయితే, పక్క గదిలో ఆ పిల్లను పడుకోమను. అందులో ఒక్క మనిషికే చోటున్నది. మధ్య గదిలో పడుకో లేవు, ఎలుకలు నిన్ను బతకనియ్యవు. నువు వెళ్ళి అరుగు మీద పడుకో," అన్నాడు ముసలాడు.

భూపతి అందుకు సమ్మతించాడు.

పక్కన ఉన్న ఇరుకు గదిలో ముసలాడు ఒక ప్రమిద వెలిగించి పెట్టాడు. అందులో ఉన్న చిన్న మంచం మీద సరస్వతి పడుకున్నది. భూపతి బయట అరుగు మీద పడుకున్నాడు.

ఒక రాత్రివేళ ముసలివాడి గదిలో అలికిడి అయి, భూపతికి మెలకువ వచ్చింది. పెట్టెలు కదిలిస్తున్న ధ్వని వినపడుతున్నది. భూపతి ఆశ్చర్యపోయి, మూసి ఉన్న తలుపు కంతకుండా ముసలాడి గదిలోకి చూశాడు.

ముసలాడు పైన ఉన్న మూడు పెట్టెలనూ పక్కన పెట్టి, అట్టడుగున ఉన్న పెట్టె తెరిచి, అందులోకి చూస్తూ మురిసిపోతున్నాడు. తరవాత వాడు ఆ పెట్టె మూసేసి, దాని మీద మిగిలిన పెట్టెలను యథాప్రకారం పేర్చి పెట్టాడు.

"ముసలిపీనుగు చాలా డబ్బు దాచి నట్టున్నాడు. ఈ అడవి మధ్య కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాడు ఆడబ్బంతా ఏం చేసుకుంటాడు?" అనుకున్నాడు భూపతి.

తరవాత అతను సరస్వతిని లేపి, తాను చూసినదంతా చెప్పి, "రేపు కూడా మనం ఇక్కడే ఉందాం. రేపు రాత్రికి దీని అంతు తేల్చుకోవాలి," అని చెయ్య వలసిన దంతా ఆమెకు చెప్పాడు.

మర్నాడు అతను ముసలాడితో, "ఈ రాత్రికి కూడా మేం ఇక్కడే ఉంటాం," అని చెప్పి, అడవిలో వేటకు బయలుదేరి పోయి, చీకటి పడ్డాక తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి కూడా ముసలాడు పెట్టెలను దించి, అడుగు పెట్టెలోకి చూసి ఆనం దించాడు. సరస్వతి, భూపతి చెప్పిన ప్రకారం, ముసలాడి గది తలుపు తట్టింది. ముసలాడు తలుపు తెరిచాడు.

"అరుగు మీద పడుకున్న భూపతి కనిపించటం లేదు. నాకు భయంగా ఉన్నది. వెతుకుదాం రా," అన్నది సరస్వతి ముసలాడితో.

ఇద్దరూ బయటికి వెళ్ళారు. తలుపు వెనకే నక్కి ఉన్న భూపతి ముసలాడి గదిలోకి దూరాడు. కొంచెం సేపు గడిచాక అతను ఇంటి బయటికి వచ్చి, సరస్వతి కనిపించగానే, "నిద్రపట్టక అలా తిరిగి వచ్చాను. నువు అనవస



రంగా ముసలాయనను శ్రమ పెట్టావు. ఇద్దరూ వెళ్ళి పడుకోండి," అన్నాడు.

ముసలాడు తన గదిలోకి వెళ్ళి, తలుపు మూసి పడుకున్నాడు.

భూపతి సరస్వతి గదిలోకి వచ్చి, "ముసలాడు డబ్బేమీ దాయలేదు. ఆ పెట్టెలో, వాడి పెళ్లాంది కాబోలు, చిరుగులు పట్టిన చీర ఉన్నది," అన్నాడు.

సరస్వతి వెటకారంగా నవ్వి, "నాకా సంగతి ముందే తెలును," అని రెండు రోజుల క్రితం తానూ, తన తండ్రీ కలిసి చేసిన ఆలోచన వివరించి చెప్పింది.

అప్పుడు జరిగిన దేమంటే, తనకు భూపతిని పెళ్ళాడాలని ఉన్నట్టు సరస్వతి తన తండ్రికి చెప్పింది.

'వాడు నిన్ను ఎలా పోషిస్తాడు?" అని తండ్రి ఆమెను అడిగాడు.

"అవసరమైతే కాయకష్టమైనా చేస్తాట్ట!" అన్నది సరస్వతి.

ఆమె తండ్రి నవ్వి, "అన్నీ ఉత్త మాటలు. వాడు మన ఇంట ఉన్న రెండు రోజుల్లో నేను కనిపెట్టాను. వాడికి డబ్బు మీద తగని ఆశ. డబ్బు కోసమే నిన్ను పెళ్ళాడతా నంటున్నాడు. అది రుజువు చేస్తాను. నేను రుజువు చెయ్యలేక పోతే నువు నిరభ్యంతరంగా వాణ్ణి చేసుకోవచ్చు. రేపు సాయంత్రం నువు వాడితో వెళ్ళిపో. అడివి మధ్య కొంపలో నే నొక మనిషిని ఏర్పాటు చేస్తాను. ఆ మనిషి భూపతికి డబ్బాశ పెట్టి, వాడి అసలు రంగు బయట పెడతాడు," అన్నాడు.

అందుకు సరస్వతి ఒప్పుకున్నది.

ఇదంతా చెప్పి, "మా నాన్న అన్నది ప్రత్యక్షంగా రుజువయింది. ఆయన ఇలా చెయ్యకపోతే, తొందరపడి నిన్ను పెళ్ళాడి, జీవితమంతా దుఃఖ పడేదాన్ని. బ్రతికి పోయాను! ఇక నీ దారి నీదీ, నా దారి నాదీ!" అన్నది.

భూపతి ఆమె ముఖం చూడలేక ఎటో వెళ్ళి పోయాడు. సరస్వతి ముసలాడి వెంట తన ఇంటికి వెళ్ళిపోయింది.





# మహాభారతం

మర్నాడే సాంబుడికి ముసలం పుట్టింది. ఆ ముసలాన్ని చూర్ణం చేసి, ఆ చూర్ణాన్ని సముద్రంలో పారేయించమని కృష్ణుడు ఉత్తరు విచ్చాడు. తరవాత అతను ఎవరూ తాగరాదనీ, తాగినవాళ్ళను కొరత వేయిస్తాననీ ప్రకటన చేశాడు.

వృష్ణి అంధకులు ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, దుశ్శకునాలు కనిపించాయి. ఎక్కడ చూసినా ఎలుకలు చెలరేగాయి. యాదవులలోనే అవలక్షణాలు తలఎత్తాయి. పెద్దలంటే ఆదరం పోయింది. భార్యాభర్తలు పరస్పరం తిట్టుకో సాగారు. భోజనంలో పురుగులు కనిపించసాగాయి. ఇలాంటి శకునాలే భారతయుద్ధం జరగబోయే ముందు కూడా కనిపించి, ప్రజాక్షయం సూచించాయి. ఇది గుర్తుతెచ్చుకుని కృష్ణుడు, యాదవుల నందరినీ సముద్ర తీరానికి తీర్థయాత్రకు బయలుదేరదీశాడు.

తీర్థయాత్రకు సన్నాహాలు జరిగాయి. పెద్ద ఎత్తున మద్య మాంసాలు తయారు చేశారు. ఏనుగుల మీదా, గుర్రాలమీదా, రథాల మీదా యాదవులు సకుటుంబంగా బయలుదేరి, సముద్ర తీరానికి వచ్చి చేరి, అక్కడ విడుదులు ఏర్పాటు చేసుకున్నారు. అక్కడ ప్రభాస తీర్థం ఉన్నది.

వృష్ణి వంశం వాడూ, కృష్ణుడికి ఆప్తుడూ అయిన ఉద్ధవుడు యాదవ

65. యాదవనాశనం

వీరులను సముద్రం ఒడ్డుకు తీసుకు పోయాడు. అక్కడ వాళ్ళు ఆకాశం బద్దలయేటట్టు ఆర్భాటం చేస్తూ తాగటం ప్రారంభించారు. కృష్ణ, బలరాములతో సహా అందరూ తెగతాగారు.

తాగిన ఆవేశంలో యుయుధానుడు కృతవర్మతో, "నిద్రపోతున్న ఉప పాండవులు మొదలైన వాళ్ళను చంపావు గదా. యాదవుడైన వాడు ఎన్నడూ అలా చేయడు," అన్నాడు. మాట మీద మాట పెరిగింది. యాదవులు తాము తాగే పాత్రలతో ఒకరి నొకరు కొట్టుకో సాగారు. వంశ కలహం ప్రారంభమయింది. ప్రద్యుమ్నుడు భోజుల మీదికి వెళ్ళాడు. భోజులు సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ చంపారు. కృష్ణుడికి కోపం వచ్చింది. అతను ఇంత గడ్డి పీకి దానితోనే అనేక మందిని చంపాడు. ఆ గడ్డి ముసలం లాగా పనిచేసింది. అందరూ ఆ గడ్డినే పీకి ఒకరి నొకరు చంపుకున్నారు. ఈ కొట్టుకోవటంలో ఒక క్రమం కూడా లేకుండా పోయింది. తండ్రి కొడుకునూ, కొడుకు తండ్రినీ కూడా చంపుకోవటం జరిగింది.

తన కొడుకులూ, మనమలూ చావటం చూసి కృష్ణుడు, ప్రాణాలతో మిగిలి ఉన్న వారినందరినీ చంపేశాడు. అప్పుడు కృష్ణుడి సారథి అయిన దారుకుడూ, బభ్రువు అనే వాడూ కృష్ణుడితో, "అందరూ చచ్చారు. మనం యిక్క



డెందుకు; పోయి బలరాముణ్ణి వెతుకుదాం," అన్నారు.

ఆ ముగ్గురూ వెతుకుతూ పోగా, వారికి బలరాముడు ఒక చెట్టు కింద కనిపించాడు. కృష్ణుడు దారుకుడితో, "నువు వెంటనే హస్తినాపురానికి పోయి యాదవులంతా మునుల శాపం తగిలి చచ్చారని చెప్పు. అర్జునుడు తప్పక వస్తాడు," అన్నాడు.

దారుకుడు రథం మీద బయలుదేరాడు. కృష్ణుడు బభ్రువుతో, "నువు ఆడవాళ్ళను కాపాడు. బంగారం కోసం దొంగలు వాళ్ళను ఎత్తుకుపోవచ్చు," అన్నాడు. కాని బభ్రువు కూడా కృష్ణుడు చూస్తూండగానే, ఒక బోయవాడు వదిలిన బాణం తగిలి చచ్చాడు. అందుచేత కృష్ణుడు బలరాముడితో, "నేను ఆడవాళ్ళను ద్వారకలో చేర్చి వస్తాను. నువు ఇక్కడే ఉండు," అని స్త్రీలను వెంటబెట్టుకుని నగరానికి వెళ్ళి, స్త్రీలను తన తండ్రికి అప్పగించి, "నేను ఈ నగరంలో ఉండలేను. బలరాముడూ, నేనూ తపస్సు చేసుకుంటాం," అని తండ్రికి నమస్కారంచేసి, బలరాముడి వద్దకు తిరిగివచ్చాడు.

బలరాముడు నిర్జన ప్రాంతంలో యోగసమాధిలో ఉన్నాడు. కృష్ణుడు చూస్తూండగానే ఒక తెల్లని సర్పం బలరాముడి ముఖం నుంచి వచ్చి, సముద్రంలో ప్రవేశించింది. ఆ సర్పానికి





స్వాగతం చెప్పటానికి వరుణుడూ, ఇతర సర్పాలూ ఎదురు వచ్చాయి.

తరవాత కృష్ణుడు దారీ తెన్నూ లేకుండా తెగతిరిగి, ఒక చోట పడు కున్నాడు. ఇంతలో జరుడు అనే బోయ వాడు వేటాడుతూ అటుగా వచ్చి, కృష్ణుణ్ణి దూరం నుంచి చూసి ఏదో మృగమనుకుని, కృష్ణుడి పాదాన్ని బాణంతో కొట్టాడు. అప్పుడు కృష్ణుడు తన శరీరాన్ని విడిచిపెట్టి, తన తేజస్సుతో భూమ్యాకాశాలు నిండగా ఆకాశంలోకి వెళ్ళిపోయాడు. ఇంద్రుడూ, సమస్త దేవతలూ అతనికి ఎదురు వచ్చి తీసుకు పోయారు.

కృష్ణుడు పంపిన దారుకుడు కురు దేశాలు చేరి, పాండవులను కలుసుకుని, యాదవ వంశాలు నాశనమైన సంగతి చెప్పాడు. పాండవులు అది విని మహా దుఃఖించారు. అర్జునుడు దారుకుడి వెంట ద్వారకకు వెళ్ళి, అనాథలైన యాదవ స్త్రీలను చూశాడు. వాళ్లు అర్జు నుణ్ణి చూసి గొల్లున ఏడ్చారు. ఆ స్థితిలో వాళ్ళను అర్జునుడు చూడలేక పోయాడు. అర్జునుడు సత్యభామనూ, రుక్మిణినీ ఊరడించి, వసుదేవుడి వద్దకు వెళ్ళాడు.

వసుదేవుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, "నాయనా, మేటి రాక్షసులను చంపిన నా కొడుకులు పోయారు. నేనింకా జీవించే ఉన్నాను. నీ శిష్యులైన ప్రద్యు మ్నుడూ, సాత్యకీ మూలంగా యాదవ వంశం నాశన మయింది. ఎవరినీ తప్పు పట్టే పనిలేదు. మునుల శాపం తగిలింది. కృష్ణుడు ఉపేక్షించాడు. నువు వస్తావనీ, నువు చెప్పినట్టు చెయ్యమనీ కృష్ణుడు నాతో చెప్పి వెళ్ళాడు." అన్నాడు.

తరవాత అర్జునుడు దారుకుడి వెంట యాదవ సభకు వెళ్ళి, మంత్రులతో, "ద్వారక సముద్రంలో మునిగిపోతుంది. నేను అందరినీ ఇంద్రప్రస్థానికి తీసుకు పోతాను. వాహనాలు సిద్ధం చెయ్యండి. ధనరాసులు పోగుచెయ్యండి. మీకు రాజు

కాబోయే వజ్రుడు ఇంద్రప్రస్థంలో ఉంటాడు. అందరూ ప్రయాణ సన్నాహం చెయ్యండి. ఆలస్యం వద్దు,'' అని చెప్పాడు.

ఆ మర్నాడే వసుదేవుడు యోగ సమాధిలోకి పోయి, ప్రాణాలు వదిలాడు. వసుదేవుడి భార్యలు దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా ఆయనతో సహగమనం చేశారు. వసుదేవుడికి ఇష్టమైన ప్రదేశం లోనే ఆయనను దహనం చేశారు. తర వాత వజ్రుడు మొదలైన వృష్ణి, అంధక కుమారులు జలతర్పణాలు విడిచారు.

తరవాత అర్జునుడు యాదవులందరూ చచ్చిపోయిన చోటికి వెళ్ళి, వారికి ఉత్తర క్రియలు చేశాడు. ఏడవ రోజున అతను ప్రయాణ మయాడు. స్త్రీలూ, చావగా మిగిలిన వారూ అతని వెంట బయలు దేరారు. రథాల మీదా, ఏనుగుల మీదా, కాలినడకనా వీరంతా పోతూ ఉంటే వీరి వెనకగా సముద్రం ద్వారకను ముంచుతూ వచ్చింది.

అర్జునుడు అక్కడక్కడా మజిలీలు చేస్తూ పంచనదం చేరాడు. అంత మంది నిస్సహాయులైన ఆడవాళ్ళ వెంట అర్జు నుడు ఒక్కడే యోధుడు ఉండటం చూసి కొందరు దొంగలు కర్రలు తీసు కుని, రాళ్ళు రువ్వుతూ ఆడవాళ్ళ పైన పడ్డారు. అర్జునుడు వాళ్ళను భయ పెట్టాడు, కాని వాళ్ళు అతని మాటలు లక్ష్య పెట్టలేదు. అర్జునుడు తన గాండీ





వాన్ని ఎక్కుపెట్టటమే ఎంతో కష్టమయింది. తరవాత అతనికి అస్త్రాలేవీ జ్ఞాపకం రాలేదు. అతను దొంగలను ఏమీ చెయ్యలేక సిగ్గు పడవలసి వచ్చింది. అతను చూస్తూండగానే దొంగలు యాదవ స్త్రీలను నాలుగు దిక్కులకూ తీసుకుపోయారు. దొంగలు ఎత్తుకుపోగా మిగిలిన స్త్రీలనూ, ధనాన్నీ తీసుకుని అర్జునుడు కురుక్షేత్రం ప్రవేశించాడు.

ధర్మరాజు నిర్ణయించిన మీదట కృతవర్మ భార్యనూ, కొడుకునూ మార్తికావతంలోనూ, చిన్న పిల్లలనూ, స్త్రీలనూ, ముసలి వాళ్ళనూ, ఇంద్రప్రస్థంలోనూ, సాత్యకి కొడుకును సరస్వతిలోనూ ఉంచి వజ్రుణ్ణి ఇంద్రప్రస్థానికి రాజుగా చేశారు. అక్రూరుడి భార్యలను వజ్రుడి రక్షణలో ఉంచారు.

కృష్ణుడి భార్యలలో రుక్మిణి మొదలైన వారు అగ్నిప్రవేశం చేయగా, సత్యభామ మొదలైన వారు అడవికి వెళ్ళి తపస్సు చేసుకున్నారు.

తరవాత అర్జునుడు వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అతన్ని చూడగానే వ్యాసుడు, "అర్జునా, ఇంత దీనంగా కనబడుతున్నావు, ఏం జరిగింది?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "మహాత్మా, నాకు విచారం ఎందుకు ఉండదు? కృష్ణుడూ, బలరాముడూ చనిపోయారు. మునుల శాపం తగిలి యాదవులందరూ నశించారు. ఎలాటి శస్త్రాల దెబ్బలకైనా తట్టుకోగల మహావీరులు తుంగగడ్డితో కొట్టుకుని చచ్చిపోయారు. ఇదంతా నాకు చాలా బాధ కలిగించింది. కృష్ణుడు లేని ఈ లోకంలో నేను ఎలా ఉంటానో తెలియటం లేదు. ఇది ఇలా ఉండగా ఇంతకన్న దారుణం జరిగింది. నా పరాక్రమం అంతా పోయింది. దొంగలు యాదవ స్త్రీలను ఎత్తుకు పోతూ వుంటే నేను వాళ్ళను వారించలేకపోయాను. నా మనసు వికలంగా ఉన్నది. శాంతి కలగటం

లేదు. నేను కాలుకాలిన పిల్లిలాగా తిరుగుతున్నాను. నేను ఏం చెయ్యాలి?'' అని అడిగాడు.

''అర్జునా, వృష్ణి, అంధకులు శాపం తగిలి నశించారు. వారి కోసం విచారించకు. కృష్ణుడు దాన్ని ఆపగలిగి ఉండి కూడా చూస్తూ ఊరుకున్నాడు. శాపం తప్పించటం అతనికి మాత్రం సాధ్యమా? కృష్ణుడు అవతరించిన పని పూర్తి అయింది. అతను తన స్వస్థానానికి వెళ్ళిపోయాడు. నువు కూడా భీమనకుల సహ దేవులతో కలిసి అనేక మహత్కార్యాలు చేశావు. మీరు కృతార్థులైనారనే నా నమ్మకం. మీరు కూడా త్వరలోనే ఉత్తమగతికి పోతారు. కాలం మారుతూ, అన్నిటినీ మార్చుతుంది. ప్రపంచమే కాలానికి అధీనమై ఉన్నది. కాలం ఒకప్పుడు మనని శాసిస్తుంది, మరొకప్పుడు మనం చెప్పినట్టు వింటుంది. నీ అస్త్రాలకు పని తీరిపోయింది. అవి పోయాయి,'' అన్నాడు వ్యాసుడు.

అర్జునుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి, ధర్మరాజుతో తాను ద్వారకలో చేసినదంతా చెప్పాడు.

అంతా విన్నమీదట ధర్మరాజుకు మహాప్రస్థానం చెయ్యాలన్న ఆలోచన కలిగింది. ఆయన అర్జునుడితో, ''తమ్ముడా, కాలం అన్ని ప్రాణులను బంధిస్తుంది,'' అన్నాడు.

పాండవులందరికీ రాజ్యత్యాగం చేసి, మహాప్రస్థానం పోవాలన్న కోరిక కలిగింది. ధర్మరాజు యుయుత్సుణ్ణి పిలిచి అతనికి రాజ్యం ఇచ్చాడు. తన రాజ్యానికి పరీక్షిత్తును రాజుగా చేశాడు. హస్తినాపురానికి పరీక్షిత్తూ, ఇంద్రప్రస్థానికి వజ్రుడూ రాజుగా ఉండేటట్టు ఏర్పాటు జరిగింది. ఇద్దరినీ కనిపెట్టుకుని ఉండమని ధర్మరాజు సుభద్రకు చెప్పి, ద్వారకలో చనిపోయిన కృష్ణుడూ, బలరాముడూ, వసుదేవుడూ, సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైన వారికందరికీ శాస్త్రోక్తంగా శ్రాద్ధక్రియలు జరిపాడు.





# మిత్రభేదం

## 14

ఒకనాడు డుండుకం అనే నల్లి సంచారం చేస్తూ రాజు పడుకునే మంచం మీదికి వచ్చి, అక్కడవున్న పేనును చూసింది.

"రాజుగారి పడక మీదికి ఎందుకు వచ్చావు. వెంటనే వెళ్ళిపో," అన్నది పేను నల్లితో.

దానికి నల్లి, "అమ్మా, అలా మాట్లాడకు. ఇంటికి వచ్చిన అతిథి పట్ల అలా ప్రవర్తించరాదు. తెలిసినవారు ఏం చెబుతారంటే, ఎంత తక్కువ వాడు వచ్చినా సత్పురుషులు, 'లోపలికి దయచెయ్యండి. కూర్చుని విశ్రాంతి తీసుకోండి. మీరు తరచుగా రారేం? ఏమిటి విశేషాలు? మీ ఆరోగ్యం బాగున్నదా? మీరు వచ్చినందుకు చాలా సంతోషం,' అనాలి. అలా ఆతిథ్యం ఇచ్చినందువల్ల స్వర్గప్రాప్తి కలుగుతుంది. నేను నీ అతిథిని. నేను రకరకాల మనుషుల రక్తం చవి చూశాను. ఆహార దోషాల వల్ల వారి రక్తం కటువుగానో, కారంగానో, చేదుగానో, పుల్లగానో ఉంటుంది. ఇలాటి దోషాలు లేని తియ్యని రక్తం ఇంతవరకు చవి చూసి ఎరగను. ఈ రాజు మహా రుచికరమైన వంటకాలూ, మంచి మంచి ఫలాలూ, అపురూపమైన మృగాల, పక్షుల మాంసమూ తింటాడు. గొప్ప వైద్యులు ఆయన రక్తం శుద్ధంగా ఉండేటట్టు చూస్తూ వుంటారు. నువు అనుమతించితే ఈ రాజుగారి రక్తం, అమృతం లాటిది, తాగి ఆనందించాలని ఉన్నది. రాజయినా, బిచ్చగాడయినా సుఖభోజనం కోరుతారుగద. జిహ్వాచాపల్యం రేకెత్తించే రుచికరమైన వస్తువులే ప్రపంచంలో లేకపోతే ఒకడికి మరొకడు సేవకుడు



కావటమూ, చెప్పుచేతలలో ఉండటమూ ఎందుకు జరుగుతుంది? పొట్టకోసమే గదా మనిషి అబద్ధాలాడతాడు, పనికి మాలిన వారికి ఊడిగం చేస్తాడు, దేశాంతరాలకు పోతాడు! అందుచేత, ఆకలితో వచ్చిన నీ అతిథిని రాజు రక్తం చవి చూడనియ్యి," అన్నది.

"అది ఎంతమాత్రమూ కుదరదు. నీ తొండం చాలా పదునైనది. కుట్టినప్పుడు చాలా బాధ కలుగుతుంది. పైపెచ్చు నువు విడవకుండా కరుస్తావు. నీ కాట్లకు రాజు తప్పక నిద్రలేస్తాడు. అది మన యిద్దరికీ ప్రమాదం. కనక, నువు వెళ్ళిపో," అన్నది పేను.

నల్లి పేను కాళ్ళమీదపడి, ఉండనియ్యమని ప్రాధేయపడింది. ఇది చూసి పేను మెత్తబడింది.

"సరే, అలాగే ఉండు," అన్నది పేను.

రాత్రి రాజు వచ్చి పక్కమీద పడుకున్నాడు. ఆయనకు కునుకుపట్టే లోపలనే నల్లి, ఆయన రక్తం రుచి చూడాలనే జిహ్వాచాపల్యంతో, రాజు పెదవిని బలం కొద్దీ కొరికింది. సూదితో గుచ్చినట్టు బాధ కలిగి రాజు లేచి నౌకర్లను పిలిచి, "నన్నేదో నల్లో, పేనో కుట్టింది. వెతికి చంపండి," అన్నాడు.

వాళ్ళు వచ్చి పక్క అంతా గాలించారు. నల్లి యుక్తిగా మంచం నెర్రెలోకి దూరిపోయింది. పరుపులో దాగి ఉన్న పేనును కనిపెట్టి, నౌకర్లు చంపేశారు.

పింగళకానికి ఈ కథ చెప్పి దమనకం, "ఈ ఎద్దు లాగా స్వజాతిని విడిచి జాత్యేతరులతో చేరేవాళ్ళు, కుకుద్రుమరాజు అనే నీలినక్క లాగా, అకాలమరణం వాతపడతారు," అన్నది.

"ఏమిటా కథ?" అని పింగళకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

కుకుద్రుమరాజు కథ

ఒక బస్తీకి సమీపాన గల అరణ్యంలో చండరవం అనే నక్క ఉండేది. ఒక

నాటి రాత్రి అది ఆహారం వెతుక్కుంటూ బస్తీ ప్రవేశించింది. కుక్కలు దాన్ని చూసి భయంకరంగా మొరుగుతూ, చీల్చి చంపాలన్న ఉద్దేశంతో దాని వెంట పడ్డాయి. నక్క హడలిపోయి, ప్రాణాలు దక్కించుకునేటందుకు పరిగెత్తుతూ ఒక కలంకారీ వాడి ఇంట జొరబడి, వాడు బట్టలకు రంగు వెయ్యటానికి నీలిరంగు నిలువ చేసి ఉంచే తొట్టిలో పడిపోయింది. అది చూసి కుక్కలు దూరంగావుండి కొంతసేపు మొరిగి వెళ్ళిపోయాయి.



నక్క నీలి రంగులో బాగా నానటం చేత దాని శరీరమంతా దట్టమైన నీలం రంగు పట్టుకున్నది. మూఢుడూ, ఆడదీ, ఎండ్రకాయా, తాగుబోతూ, నీలిరంగూ పట్టుకుంటే వదలవని సామెతే ఉన్నది గద! అమిత ప్రయాసపడి ఎలాగైతేనేం నక్క నీలిరంగుతొట్టె నుంచి బయటపడి, పారిపోయింది. ఈ సారి కుక్కలు దాని రంగు చూసి నక్క అని పోల్చుకోలేక దాన్ని పోనిచ్చాయి.

నక్క అరణ్యానికి తిరిగి వచ్చింది. సింహమూ, ఏనుగూ, పెద్దపులీ, చిరుత పులీ, తోడేలూ, ఎలుగుబంటూ, ఇతర అరణ్యమృగాలూ ఒకదానిని ఒకటి రహస్యంగా, "ఎన్నడూ ఎరగమే. ఎవరీ అద్భుతమైన నీలం ప్రాణి?" అని అడుగుకున్నాయి.

ఈ కొత్త జంతువు బల శౌర్య పరాక్రమాలు తమకు తెలియని కారణంచేత అవి నక్కకు ఎడంగా తప్పుకుని తిరగ సాగాయి.

తనను చూసి ఇతర జంతువులు భయపడుతూ ఉండటం చూసి చండరవం, "ఓ వన్యమృగాల్లారా, నన్ను చూసి ఎందుకు బెదిరిపోతున్నారు? మిమ్మల్ని పాలించటానికి రాజు లేడని గ్రహించి ఇంద్రుడు, మీకు రాజుగా ఉండి, మిమ్మల్ని కాపాడటానికి నన్ను పంపాడు. అందుకే నేను వచ్చాను.

నా పాలనలో మీరు క్షేమంగా ఉండండి. ఇకనుంచీ నేనే మీ రాజును. నా పేరు కుకుద్రుమం,'' అన్నది.

ఈ మాటలు విని సింహమూ, పెద్ద పులీ, ఏనుగూ, చిరుతపులీ, ఎలుగు బంటూ, తోడేలూ, కోతీ, లేడీ, కుందేలూ, ఇతర మృగాలూ నక్క ముందు సాష్టాంగ పడి, ''తమరు చెప్పినట్టు వింటాం,'' అన్నాయి.

కుకుద్రుమం సింహాన్ని తన మంత్రి గానూ, ఇతర మృగాలను ఇతర హోదాల లోనూ నియమించి, తన జాతికి చెందిన నక్కలను హీనంగా చూసి, దూరంగా తరమగొట్టింది. సింహం మొదలైన జంతు వులు వేటాడి, మాంసం తెచ్చి కుకుద్రు మానికి సమర్పించేవి. ఆ మాంసాన్ని తినగలిగినంత తిని, మిగిలినదాన్ని రాజధర్మం ప్రకారం కుకుద్రుమం అన్ని జంతువులకూ పంచేది.

కొంతకాలం పాటు కుకుద్రుమం పరి పాలన అద్భుతంగా సాగింది.

ఒక రాత్రి నక్క భోజనం ముగించి పవ్వళించింది. సింహమూ, పెద్దపులీ, ఏనుగూ, చిరుతపులీ, కోతీ దానికి కావలి కాస్తున్నాయి.

ఉన్నట్టుండి నక్కలమంద ఊళలతో అరణ్యం మారుమోగింది. కుకుద్రుమం తనను తాను మరచిపోయింది. దాని రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఉద్రే కంతో దాని కళ్లలోకి అశ్రువులు దిగాయి. అది ఆనందపారవశ్యంలో పడకమీది నుంచి దూకి, బలంగా ఊళ పెట్టింది.

ఇది చూసి సింహం మొదలైన జంతు వులు, '' ఇది మామూలు నక్కే '' అను కుని అవమానంతో క్షణంపాటు తలలు దించేసుకున్నాయి. కాని అంతలోనే వాటికి ఆగ్రహం వచ్చేసింది. '' ఈ క్షుద్ర జంతువు మన సేవలు పొందుతుందా? దీన్ని చంపాలిసిందే! '' అని అవి అనటం విని, నక్క తప్పించుకు పారిపో బోయింది. కాని, పెద్దపులి దాన్ని పట్టు కుని, చీల్చి చంపేసింది.



# 152. "బిరడా" చెట్టు

సీసాలకు పెట్టే బిరడాలు ఒక రకమైన చెట్టుబెరడు నుంచి తయారు చేస్తారు. ఈ చెట్టు స్పైన్, పోర్చుగల్, ఆల్జీరియా, ఇటలీదేశాలలో పెరుగుతుంది. చెట్టుబెరడును తీయటం బొమ్మలో చూడవచ్చు. పాత బెరడు తీసిన అనంతరం చెట్టున కొత్త బెరడు పెట్టుకొస్తుంది. ఇలా 8, 10 ఏళ్ళకొకసారి బెరడును తీస్తూ ఉండవచ్చు. తీస్తూ పోతున్న కొద్దీ బెరడు నుంచి మంచి బిరడాలు వస్తాయట.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేటి బాలుని ఆట

పంపినవారు:
ఎ. జనార్దనం బి. యస్సీ.

Photo by S. B. Takalka



కంగటివీధి,
పార్వతీపురం.

నాటి భరతుని బాట

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు ఆగష్టు 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట: మెట్లదారి

మూడవ అట్ట: రాళ్ళదారి


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

